## —: PATRONS :—

1 S. V. M. S. Vidiyala Nagalingaiah Devar B. A.,
Retd. Dist. Registrar, Nellore

2 „ G. K. V. Devar B. A. B. L., Advocate,
Guntur.

3 „ G. Nagabhushanam Devar,
Retd. Dist. Registrar, Ellore.

"సాహిత్యవనం" తెనాలి సమర్పించు

# పెండ్లీడు

(A Melo Drama on Human Satirism)

Plot Suggested and Directed by

**V. NAGESWARA LINGAM**

*

**1951**

# తప్పొప్పుల పట్టిక

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 37 | 10 | గుంజీలు | గుండీలు |
| 42 | 5,6 | అలాగా | అలాగే |
| | | వివస్ధయై | వివస్త్రయై |
| 45 | 12 | సౌజదరాన్ని | సౌధరాజాన్ని |
| 5 | 1 | అంతర్ధానం | అంతరార్ధం |
| 33 | 2 | మీ రేమైనా | మీ రైనా |

అని మార్చి చదవండి.

Note: గేవట్టును, గావట్టు, గ్యావట్టు అనికూడా పిలుస్తూ వుంటారు.

——o——

# పెండ్లీడు

పిల్లలతో గూడి రాజు కాపురం చేస్తూవచ్చాడు. కాని తన కూతురు విషయంలో ఏవిధమైన నిర్ణయానికి రాలేక పోతున్నాడు.

మిత్రుడు స్రవంతుడు ఎన్నివిధముల బోధించినను అతనికావిషయంలో అర్థంకావడంలేదు. తన పట్టుదలను వదిలేటట్టు కనపడదు.

అమాయకురాలు యవ్వనాంగి —ఎవరు — అతని కూతురు.

మిత్రమా స్రవంతా ప్రపంచంనీకర్థంకాలేదు. అనుభవంగలవాళ్ళు ప్రయత్నించి యితమిద్ధంగా ఊరుకున్నారు. ఈలోకంలో అందమైనఆడదాన్ని చూచి ముగ్ధులు కానివారు ఉండరు. అందులో స్త్రీసౌందర్యం అతి మధురమైనది. కాని ప్రపంచం—దాన్ని నడవడి అర్థంచేసుకుందాంఅంటే ఆఅనుభవంకూడా గుణము లేదు.

అవును నీవుచెప్పింది నిజం. కాని యినుపకటకటాల్లో ఉంచడం స్వేచ్ఛను అరికట్టడం సామాన్యనిషేధన లనిపించుకోవు. సరె నాకిక సెలవు.

ఆగు! మిత్రమా! ఆగు!నిన్నుఅన్యధా వ్యక్తీకరించుట లేదు. అప్తుడవై సఖుండవైన నీతో నాయింటివ్యవహారములు ముచ్చటించుటకంటే నాకింకేమున్నది. ఆమెను కష్టపెట్టుట నాఅభిలాష కాదు. అందు నాకేవిధమైన సంతోషము సుఖము జనింపవు. కాని అనుభవంలేని ఆడవాళ్ళు గాలికితిరిగే మొగాళ్ళ కంటబడితే వారు వారిమధురామృతమును గ్రోలి విడిపోయి వారిని అవివాహితులుగా చేసిపోతారేమో అని నాభయము.

మిత్రమా విచారించకు. కడుసమర్థుడవు. ఆమెకు విద్య చెప్పించు. విజ్ఞానవంతురాలుగ చెయి. తరువాత తనమార్గం తాను చూచుకుంటూ ఉంటుంది.

అమ్మాయి యిటురా .... కైఅసాలలోఉంచి స్వేచ్ఛను అరికట్టానని చింతపడుతున్నావేమో దగ్గరకురామ్మా ఈ పుస్తకము చదువు. లోకంనీకర్థమవుతుంది. విజ్ఞానం సంపాదింపగలుగుతావు. [నాన్న మీరుచెప్పింది కాదనను. కాని ఏమార్గము ఎరుగనినాకు యిపుడీవిజ్ఞానం ఎందుకండి, నావిషయంలో మీరేమైనా అనుమానపడుతున్నారా?

అదికాదమ్మా. నీవింకను చిన్నదానవు. ప్రపంచాన్ని అర్థంచేసుకోవాలి. చిరకాలం రాళ్ళురప్పల్లో యీదటం మన తరంకాదు. చాలాకష్టం. నీలాంటివాళ్ళు అకారణంగా సంఘానికి గురిఅవుతారు. వాళ్ళదృక్పథంలో నీచంగా చూడబడుతారు. ఆధారాలు అనుభవాలు లేకుండా సంచరించటం ప్రమాదం. అపవాదులు ఆరోపణలు అవంతట అవేవస్తవి. ఇరుగుపొరుగువారు చూచి సహించరు. నీప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములగును.

నాన్న ఎందుకలాభయపడుతారు. నీవున్నంతకాలం నాకేలాంటి యిబ్బందులు తటస్థించవు. నాజీవితం సుఖంగాసాగిపోతూ ఉంటుంది. ప్రస్తుతము నాకుప్రపంచంతో నిమిత్తము లేదు. నేను ఏవిధంగానైనా దాన్ని జయించటానికే ప్రయత్నిస్తాను. పోని వాళ్ళతో తిరగడం సంభవించినా మానవపరిచయం పవిత్రమైనదని రుజువుపరుస్తాను.

అమ్మాయి ప్రపంచందాన్ని జయించడం సులభసాధ్యంకాదు. నాసంగతిచెప్పితే నీవు చాలవిచారిస్తావు ... నేనొకకామాంధుడను. నాకాలంలో నేననుభవించని భోగంది మన జిల్లాలోనేలేదు. తాతలు సంపాదించిన ఆస్తి యీవిధంగా కర్చుపెట్టాను. 'చివరకు మానవుడు ఆరసంలోదిగకూడదేకాని దిగి దాన్నిమరగిన తరువాత దాన్నుండి విడిపోవడంఅసాధ్యం అసంభవం.

నాన్న ప్రపంచంలో ప్రతిమానవుడు ఏదోఒక పొరపాటు చేస్తూవుంటాడు. దానికి నేనుకాదనను. సహజంగా

కామించి, తరించిన విశృంగారం అందలి అనుభవాలు విన్న విస్తే నాకు అవి కొంతఅనుభవయోగ్యంగావుండి నాజీవితా నికి సహాయపడుతాయి అనుకుంటూ—

అమ్మాయి. ఆశాస్త్రం చెప్పాలంటే తనివితీరదు అంతుపొంతు లేని స్త్రీసాంగత్యము ఆజీవాలతోనే అంతరిం చాలి. పోని ఉదాహరణకొక కథ చెప్పుతాను విను—

సుశీల అనేఅమ్మాయి జీవకర్ర అనేగ్రామంలో ఉంటూ ఉండేది, ఆమె తలిదండ్రులు సామాన్యకుటుంబము నకు జెందినవారైనను సంఘానికి అనుకూలమైన గౌరవ ప్రతి ష్ఠలు సంపాదించుకోగలిగారు. పాశ్చాత్య వ్యామోహానికి కట్టుబడినవారు ఆమెను కళాశాలలో ప్రవేశపెట్టారు. ఆమె పాశ్చాత్యుల పుస్తకముల చదివి అందలి శృంగారమనుభ వించి విద్యార్థులతో విహరించడం, మాట్లాడి ఆనందించడం అలవాటుచేసుకుంది,

కొంతకాలం విద్యార్థులతో విహరించడంవల్ల వేశ్యా వాహినిలో తిరగడం ఆమెకు అలవాటయింది. కామంపరిపా టయింది,

నవ్వే! నేనుకూడా అలాఅవుతానని విూభయమా నాన్న! కాదమ్మా. ఆమెమార్గం అదొకచిత్రంగా ఉంటుంది. కథపూర్తిగావిని తరువాత నీయభిప్రాయం తెలియపరచు,

అలాకాదునాన్న! మీకథ అంతర్ధానంప్రస్తుతప్రపంచ కామంతోఅవగాహన అయింది, పరిస్థితులు మారాయి. ఏ కాలంలోనైనా కామంతో ఉన్న మొగాళ్ళను వీసర్జించడం నా సంకల్పం. వారివరిచయంనాకు దుఃఖబీజము,

అట్లనకమ్మా! నాస్థితి మరింతనీచంగా పరిణమిస్తుంది. స్త్రీ సాంగత్యము కడు పవిత్రమైనది. మానవుని ఆనందసాగరమున ముంచి ఆకాశవీధుల తిరింపజేస్తుంది. నీవిలా మాట్లాడితే నేనావిరహబాధ భరింపజాలను.

నాన్న!మీరిలా మాట్లాడడం యిదే మొదటిసారి. మీఅభిప్రాయం నేనిపుడు సంపూర్ణముగా గ్రహించాను. విజ్ఞానులకు కామం ఒక ఆటవస్తువు. కామాంధులు దంపతులకు అపాయకారి. వానిచేష్టలకు కొన్ని కుటుంబాలు కుమిలిపోతవి. సరె ఇక మీకథపూర్తి కానివ్వండీ.

కాలేజి సెలవులకు ఆమె యింటికివచ్చింది. అవమానం భరింపలేక తల్లిదండ్రులు ఆమెను యింటినుండి వెడలగొట్టారు.

మావంశంనాశనం చేయుటాసికి పుట్టావు. విద్యావతివై నీవిలాప్రవర్తించడం నాతలకొట్టినట్లయింది. నీచావు ఎంత త్వరితంగా వస్తే అంతసుఖిస్తాం. ఆచావు యిపుడే సంభవిస్తే మరీ హాయిగాఉంటుంది. అని తండ్రి అన్నాడు,

తరువాత పాపం ఆమెగతి ఏమైందినాన్నా!

ఏమనిచెప్పను సుతా! చావమని అంతరవాణి చెప్పింది. సముద్రమూ, నదియూ లేక బావా అవన్నియు ఆమెబుర్రలో గిర్రున తిరుగుతూ ఆమెను బాధపెట్టాయి. సముద్రానికి వెళ్ళవలెనని ఆమె నిశ్చయించుకొంది. అయినుకో మైదానంలో ఆమె పాదములు వడివడిగా చొంచుకుంటూ వెళ్ళాయి.

పాపం! చావు అంతచులకనైనదా నాన్న. చావటానికి సిద్ధమైందా?

అవును. విరక్తి విజ్ఞానం ఆమెను మరింత కూలదోసినవి. తలిదండ్రులు చేసినఅవమానం భరింపలేక నలహా సముద్రాన్ని అడగటానికి వచ్చింది. పిచ్చిదానివలె వకవకనవ్వడం నీకారం వికృతం అవన్ని ఆవరింపజేసుకుంది.

పాపం, విద్యావతి. కాలేజివిధానం అలవరచుకొన్న వ్యక్తి ఆవరిసరాలలో తిరగడం మాని యిలా కష్టపడడం దేనికి. చాల దుఃఖంగాఉంది నాన్న. దానికి కారణం? ఎవరిది లోపం. విజ్ఞానం నశింపజేసి పశువులవలె తయారుచేసే ఆకళాశాలదా ఈలోపం. ఆకలిమంటలతో మలమలమాడి ఆస్తిపాస్తులనమ్మి చదువుచెప్పించిన తల్లిదండ్రులదా లోపం. కామ, అమానుకంగాఉండే ఆడవాళ్ళనిఅసభ్యంగాతయారుచేసే సంఘానిదా ఈలోపం నాన్న?

ఇందెవరిది కాదు. అసభ్యమైన ఆమెప్రవర్తనయే యిందులకు కారణం.

అదెలా? సహవాస పరిస్థితులలోకదా ఆమె అలా మార్పుజెందినది. పాపం ఆమెను తేతగులాబిపువ్వు సంఘానికి వదలివేయుడమైనది. అన్యాయం అకారణంగా ఆమె సంఘముచేత నలుపబడి ఒక వింతపువ్వుగా వదలబడింది. ఆ పరిస్థితులలో ఆమె సంఘంనుండి విడిపించుకోవడం అసాధ్యమైనది కాపుం ఆమెను ఆవరించింది.

పరిస్థితి యిలా ఉంటే యిందాకా తప్పేము న్నది నాన్న.

పిచ్చితల్లీ. అతుకులువడ్డగిన్నె క్రొత్తదాని అంత అందమిస్తుందా. క్రొత్త వస్త్రములమోజు పాతవాటిమీద ఉంటుందా. తనశీలాన్ని తాను నిలబెట్టుకోవాలి కాని పరిస్థితులు సహాయపడతవా. విద్యావతి తాను ఆవిధంగా సంచరించడం అమాయకం అజ్ఞానం అనిపించుకోదు. పోసి తనకా ప్రవర్తన యిష్టమైన దానికనుకూలమైన వాతావరణాన్ని ఏర్పరచుకోవాలి. అంతే

శీలం వేరు, వ్యభిచారం వేరు. శీలానికిఉన్న గౌరవం వ్యభిచారానికి లేదు. సాంఘికప్రవర్తనకు అధిక సంఖ్యాకులకు

వ్యభిచారం రుచిగా ఉంటుంది, శరీరసుఖం, ఆనందసామ్రాజ్యం వారు పొందవచ్చు. ఉత్తమమైన రీతుల జీవితం గడవటానికి అవకాశములు ఏర్పరచుకొనవచ్చు. కాని శీలానికి ఉన్న గౌరవం వేరు. ఆత్మార్పణం దైవస్వరూపం అనునవి దానికి అండగా ఉంటవి. ఆనందం జ్యోతిర్మయం విశ్వలత్వం సృష్టించు కొని జీవితాన్ని స్వర్గవీధుల త్రిప్పుకొనవచ్చును. కాని ఈమార్గం ప్రాప్తించడం సామాన్యంకాదు. దేశంతిరగాలి. జీవితాన్ని బండిచక్రమువలె పోనివ్వాలి, అన్వేషణకు మనోవేగం ఎక్కువగా ప్రసరింపజేయాలి. ప్రపంచాన్ని గాలించి విజ్ఞానం సంపాదించటానికి ప్రయత్నించాలి. అట్టిపరి స్థితులలో శాశ్వతమైన సుఖం శాంతి, లోకానుభవం అవంత టవే ఒకనాడు సమకూడుతవి. యివి సామాన్యుల కందుబా టులో ఉండవు.

పోని నాన్న! ఈసమస్య నాకిపుడర్థంకావడంలేదు. తరు వాత ఆమెకథ ఏమైంది? చెప్పు.

సముద్రం ఈవిధంగా చెప్పింది, చదువుకున్నదానవు, ఏఉద్యోగమైనా చేసుకో. నిన్నువరించేవాడు రాకమానడు. దిగులొందకుము. చావడం అనుకున్నంత సులభసాధ్యంకాదు.

కామంతాండవించి ఉండడంవల్ల ఆమె ఉద్యోగంచేయటా నికియిష్టపడలేదు. మరలబాహ్యప్రపంచమునకు తిరిగివచ్చింది. కనబడినవానితో సుఖాన్ని అనుభవించడం ఆనందించడం

జీవితాశలనినిర్ణయించుకొంది. అంతులేని ఆకాశానికి ఆశలు కూడా నిండుగ నుంటవి. ఆరసానికి తగినవాళ్ళందరు ఆమెను అనుభవించి సుఖాన్ని పొందారు. ఆమెకు వ్యభిచారం కళ్ళు కప్పించి. ఆమార్గం ఆమెకు అలవాటైపోయింది.

కొన్నాళ్ళనంతరం ఆమెకు కాలేజిరోజులు జ్ఞప్తికి వచ్చినవి. ఒకనాడు కాలేజికి రిక్షాలోవెళ్ళింది. ఆల్బర్టు అనేవిద్యార్థి అలాపోవడం జరిగింది. అతనికి మిలటరిలో పెద్ద ఉద్యోగం అట.

అతన్నిచూసి ఆల్బర్టు ఆల్బర్టు అని కేక వేసింది. అతడు అత్తవారింటికి సెలవులకు వచ్చాడంటూరు. ప్రిన్సిపాల్ కు గౌరవార్థం ఏర్పరుపబడిన మీటింగుకు హాజరయ్యాడంటూరు.

ఎవరు? నన్ను పిలిచింది అని వెనుకకుతిరిగాడు

సుశీల కాలేజి సహపాటి. నేనొకనాడు ఆమెను కామిం చాను. జ్ఞాపకంవచ్చింది నన్నిపుడు పిలచిందిఅంటూ ఆమె వద్దకు వచ్చాడు.[ఆల్బర్టు నిన్నుచూసి చాలరోజులైంది. నీతో రహస్యంగా మాట్లాడాలి. అపెరటిలోనికి వస్తారా! అని ఆమె అడిగింది.

ఏమి సుశీలా యిలా అయిపోయావు. ఈరోడ్లమీద యిలా సంచరిస్తున్నావు దేనికి! నీవిలా అవుతావని నేను కలలోనైనా అనుకోలేదు. పోని పెండ్లయినదా ?

అగడియలు యింకను ప్రాప్తించలేదు. అవివాహితను విచిత్రం. దుఃఖమేస్తోంది. అశ్రువులు రాలాయి. యిన్నాళ్ళు ఎలా ఊరుకో గలిగావు. పోని మీతలిదండ్రు లేమయ్యారు.

వారు నన్ను యింటికిరానివ్వలేదు.

అశుభము సుభము ఎరుగని నిన్ను నీవాళ్ళు యిలా వెళ్ళకొట్టడం చాల అవమానకరం. సహింపరానిది. ఆవూరు గొడ్డుపోయిందా. మంచి చెడ్డలు చెప్పేవారేలేరా? కూతుళ్ళను పోషించలేని తలిదండ్రులంతా కనడం దేనికి. మాట మంచి చెప్పే పెద్దమనుష్యులే లేరా ఈలోకంలో?

అవును ఆల్బరు దానికి కారణం నేను. నాజీవితమొక దుఃఖసాగరం అంటూ ఏడ్వడం ప్రారంభించింది. సుశీలా ఏడవకు అని ఆమెకన్నీరు తనరుమాలుతో తుడిచాడు.

నేను మూడురోజులనుంచి వస్తు. మనసు చావమని సలహా యిస్తుంది. కాని భూతం చావనివ్వడంలేదు. అన్నిటికి సిద్ధమయ్యాను. ఈపోరాటంలో విసుగుజెంది కాలేజివైపు వచ్చాను. గడచినరోజులు తలచుకొంటే నాగుండెలదురు చున్నవి. ఆరోజుల్లో నీవు నన్ను వాంఛించావు. నేను దాన్ని

తృణీకరించాను. మరల దైవం మనలసమకూర్చాడు. నాతో గూడి సుఖించు. రమించు దోబూచులాడుకో ఆల్బర్టు.

ఏమది సుశీలా! అంతనీచంగా ప్రవర్తిస్తున్నావు. నీపరిస్థితి చూస్తుంటే చాలఘోరంగా కనబడుతుంది. నేనిదివరకటి ఆల్బర్టును కాను. నేనొక అమ్మాయిని ప్రేమించి పెండ్లాడాను.

సుశీల కన్నీరు కారుస్తుంది.

విచారించకు సుశీలా. జీవితం నీకిపుడొక దుఃఖసాగరం. మాకొకసందిగ్ధానం. ప్రేమించి పెండ్లాడినభార్యను విసర్జించి యిలాంటి అవకాశాన్ని చేరదీసిఆనందించి అనుభవించడమా? నాకర్థంకావడంలేదు.

నీచర్య నన్ను మరింత దుఃఖపరచు చున్నది. ఆల్బర్టు.

విచారించకు. హోటలు ఎవరెష్టుకు వెళ్లాంపా. భోజనానంతరం మాట్లాడుకొందాం.



II

## హోటలు _ ఎవరెస్టు

వీళ్లిద్దరు రావడం హోటలు మేనేజరు గుర్తించాడు. అతని వేషం మిలిటరీ మనిషి అని తెలియుపరుస్తుంది. సుశీల విషయుం అత డిదివరకే విని ఉన్నాడు. వెంటనే వారికి ప్రత్యేకమైన గది మేడమీద కేటాయించాడు. అతడు భోజనానికి ఆర్డరు యిచ్చాడు. ఆమె స్నానం చెయ్యాలంది.

కొంతసేపటికి భోజనం సరఫరాయింది. వారు తింటూ సుశీలా నేనొక వింతకథ చెవుతాను విను. యుద్ధంరావటంతో నేను మిలిటరీలో రిక్రూటు అయ్యాను. నా కవుడు వివాహం అవడం వల్ల మా తల్లి దండ్రులు నేనా ఉద్యోగం చేయటానికి యిష్టవడలేదు. కాని నేను వారి మాటలు లక్ష్యం చేయకుండా వెంటనే మిలటరీలో జేరి అమెరికాకు వెళ్లాను. "రాబర్టు" అను హోటల్లో ఉంటూ వచ్చాను. తెల్లవారు జామున నాకు ఏదో శబ్దం వినబడింది, లేచి వారగా ఉన్న కిటికి తెరచి చూచాను. అంతా అమెరికను ఆనందంతో మునిగి ఉన్నారు. యుద్ధం గెలవడంవల్ల విందులు చేసుకుంటూ ఉన్నారని తలచాను. కాని ఈ స్వాతంత్ర్యం సౌఖ్యం మన దేశానికి ఎవుడొస్తుందా అని తలపోశాను. అంతలో

నా ఆలోచన మరలింది. ఆ జనంలో ఉన్న ఒక సుందరాంగి నన్నాకర్షించింది. ఆమె నా వంక చూసింది. రమ్మని సౌజ్ఞ చేసింది. అబ్బా అంతా ఆ మరునాడు రాత్రి కలవరమాయెను. పెందలకడ లేచాను. కాలకృత్యాలు తీర్చుకొన్నాను. ఎవరో తలుపు తట్టారు. చుర చుర వెళ్ళి తలుపు తెరచాను. పోష్టుమేను ఆత డొక ఉత్తరం చేతికిచ్చాడు.

ఎవరు వ్రాసింది. క్రొత్తప్రదేశం. నాకెవరు బంధువులు స్నేహితులు లేరే ఈ అమెరికన్‌లో! ఇదెలా వచ్చింది. అని కవరు వెంటనే చింపి తెరిచాను. ఆ లేఖలో ఈవిధంగా వ్రాసి ఉన్నది.

Dear ఆల్బర్టు !

నీవు మా దేశం రావటం మా భాగ్యం. మీ భారత దేశ ప్రఖ్యాతి నేను చాలాసార్లు విన్నాను. భారతావని నుండి వచ్చిన ప్రముఖులంతా నా సహోదరులు. నీవు బైబిలు తెచ్చావా? లేనియెడల నేనొక క్రొత్త బైబిలు పంపనా.

Yours Lovingly,
Skyes

ఈ ఉత్తరం నన్ను మరింత కలవర పరచింది. వెంటనే ఆ వూళ్లో కట్టెలుకొట్టే Jawar ను పిలచి ఆమె

సంగతి అడిగాను. ఆత డిలా సలహా యిచ్చాడు. ఆమె ఈ వూరిలో ఉండే స్త్రీల కందరకంటే సుందరమయినది. ఆమె కౌగిలికోసం ప్రయత్నించి విడచిపెట్టినవారు చాలామంది ఉన్నారు. ఆమెను రమించడం అనుభవించడం స్వర్గాన్ని చూడడం అంటూ అతడు సమాధాన మిచ్చాడు.

ఆ సాయంత్రం కారులో ఆమె యింటికి వెళ్లాను. సహృదయంగా ఆమె నన్ను గౌరవించింది. తాజమహాల్ కుతుబ్‌మినార్ మొదలగు భారతావని శిఖరాలను శిల్పాలను ఎక్కువగా కొనియాడింది. పల్నాటి వీరుల చరిత్రను విజయ నగర సామ్రాజ్య వైభవాన్ని విశదీకరించింది. మగధావని ప్రఖ్యాతిని మొగలాయుల ప్రభుత్వమందలి అక్బరును పొగడింది. ఆతని రాజనీతి హిందువుల యందలి అనురాగం మేము చిత్ర విచిత్రంగా తర్కించాము. ఆతని మేధాశక్తి, పరిపాలనా విధానం హిందువులకు శాంతి నిచ్చినదన్నాను. ఆమె ఔరంగజేబు ప్రవర్తన యందలి స్వార్థపరత్వమును క్రూరమును నిందించి అతడు టోపీలు కుట్టి వాటిని అమ్మి జీవించడం గల రహస్యార్థం మేమిద్దరం కొంతపాటుపడి ఊరుకున్నాం. అప్పుడది మాకర్థం కాలేదు. చివరకు ఆమె ఆంధ్రు లనేడి రెడ్డిరాజుల నెక్కువగా ప్రశంసించింది.

ఆమె సంభాషణ ఓర్పుతో వింటూ వచ్చాను. భారతీయులమీద ఆమెకున్న ఆదరాభిమానములు నన్నెంతో

ఆనందపరచినవి. ఆమెను ఏవిధంగానైనా సంతోషపెట్టి నా అభీష్టము తీర్చుకోవచ్చునని కుతూహలపడ్డా. ఆమె కారులో షికారుకు తీసుకువెళ్లింది. కొంతసేపు దూరప్రయాణం జేసి నయాగరాజల పాతము సమీపంలోకి వచ్చాం. ఆమె ప్రకృతిని కడు రమ్యంగా చిత్రించింది. ఆ ప్రాంతములందలి పచ్చిక బీడులన్ని ఆమె ఆ రోజంతా తిరిగింది. సెలయేరులు కొండ కోనలన్నీ గాలించాం. అజంతా ఎల్లోరా కేవులవలె నిమిడి యున్న చిత్రకళలను గోపరములనుచూచాం. అమెజాన్ నదీ తటిపై ఆమె పాడింది, ఆ గానం నన్ను మరింత పులకరింప జేసింది.

నేను Skye<sub></sub>s తో గాంధి మహాత్ముని గురించి వివరించాను. మహాత్ముడు 70 సం॥ నిండినవాడైనప్పటికి ఆతని పాటవము కుంటుపడి యుండలేదు. ఆతని శరీరమందలి ప్రతి ఆయువు సంజీవంగా వుండి తమ కాలాన్ని సద్వినియోగము చేసుకుంటూ వచ్చినది. అందాల చిన్నెల రాణి తన బంగారు ముఖారవిందమును స్వేచ్ఛానువృత్తిగా ప్రజ్వలించి విరాజిల్ల చేసుకుంటూ వుంది, 70 సం॥ ముదుసలి కుర్రవాని లాగా తిరగడం రాజకీయ రంగాలలో వ్యవహరించడం ఆతని అంతరంగిక నైతికశక్తులను విలువరిస్తుంది. తర తరాలనుండి వెలువరించిన నాయకులు ఆతని ముందర మోకరిల్లి మొగ్గుకు బోలినవారు. ఆతనిపటుత్వము కార్యదీక్ష మా భారతావని కూలబడిన కాలంలో వాటిని తీర్చి దిద్దటానికి అవతరించిన వారి

వకె ప్రసరించినవి. మీ పాశ్చాత్యుల పరిజ్ఞానం కుంటుబడిన రోజుల్లో సలహాదారుడై భారతావనికి స్వరాజ్యం అహింసానుష్టానంగా సాధించగలిగాడు. భారతావనికే తాతగాడు. లోకాలకి ముల్లోకాలకి కూడా తాత అనిపించుకున్నాడు. కాని Skyes అలాంటి వ్యక్తి మమ్ములను విడచి కైవారం కావడం మా కెంతయు శోచనీయం. కాదు. వారి కీర్తి భారతీయులు నిలబెట్టాలంటే అశ్రువులు రాల్చడంకాదు. వారంతట వారిగా తయారవడే అని ఆమె సలహాయిచ్చింది.

Skyes నేను మీతో సంచరించడం ఈ ప్రదేశముల చూడడం నాకొక క్రొత్త అనుభవం చేకూర్చిందన్నాను. మీ సాంప్రదాయంవల్లకలిగేఔన్నత్యం, సాంగత్యంవల్ల పొందే పరిజ్ఞానం మాభారతావనిలో సంభవించవు. అని తెలియపరచాను. ఆవిడనన్నంతటితో వదలలేదు. చర్చికివెళ్దామనిచెప్పింది. కారు చర్చివైపుకు మరలింది. జోరుగా రోడ్డుమీద పోతూవచ్చింది.

ఆమార్గంలో దూరంగాఉన్న కొన్నిగోరీలు కనబడ్డవి. పాడుబడి శీర్ణించినవికొన్ని. నూతనముగా నిర్మింపబడినవి కొన్ని. పాతవై నిర్జీవంగా నెలబడ్డవికొన్ని నాచూపుల్లో గిరన తిరిగాయి.

ఆమె నన్నక్కడికి తీసుకువెళ్ళింది. అంతలో నేఆసమాధులన్ని అంతర్థానమయినవి. ఆకనపడు పిల్లగోరీలలో మంథబాగ్యులెవరో కన్నులుమోడ్చి నిదురపోతున్నట్లున్నారు.

పాపం వారికి ఎన్నాళ్ళు ఈ పలసంలేని శోధనం. ఆ తల్లులు ఎంతగా అల్లాడేరో. వారి కన్నీటికాల్వలు వేడిప్రవాహాలలో సలసల క్రాగిపోయి ఉంటవి కాబోలు. ✓

ఈ ఆలోచనలు నా మనస్సులో మసలుతూ ఉన్నాయి. ఆవిడ నా ఆలోచనలకనుకూలంగా ప్రవర్తించింది. ఆల్బర్ట్ ఎందుకలా పరధ్యానంలో ఉన్నావు అంటూ తలతట్టింది.

Skyes మానవజీవితం నాకొక విచిత్రమైన సంగరము. చెట్టుపుట్టినటు తానా మొగ్గరములనుండి వెలువడుతుంది. నిదానంగా పెంపొందుతుంది. పచ్చగా వికసిస్తుంది, విశాలంగా పెరుగుతుంది. ఎండవానలకు గురిఅవుతుంది. రాత్రులందు ముడుచుకొని మంచుతో నింపారుతుంది. కొన్నాళ్ళకు ఎండి పడిపోతుంది. అలాపడిన పండుటాకు గాలికి కొట్టుకుపోతుంది. ఎండి కుప్పగాజేరి గలగల మోతయిస్తుంది. ఈ మార్పుకు చెట్టెప్పుడు విచారించదు. మరి మానవుడు జీవితంలో శ్రమపడడం దేనికి నాకర్థంకావడంలేదు. Skyes ఈ తలపు మరింత జీవితంమీద విజ్ఞానం విరక్తి పుట్టిస్తుంది. [ఆల్బర్ట్! ఆ కనబడు చర్చిలో మతగురువు వున్నాడు, వారికి జీవితమొక ఆటవస్తువు వారు సంశయముల తీర్చగలరు. వారినడిగి తెలుసుకొందాం. అని ఆవిడ సలహాయిచ్చింది.

ఆమరునాడు చర్చికి మేమిద్దరం వెళ్ళాం. పెద్దగోపురాలతో గంభీరంగా నిర్మింపబడి ఉంది. ఆ చెట్లసముదాయము ఆశ్లోలనిర్మాణం కడురమ్యంగా ఉన్నవి. ఆవాతావరణం నాసమస్యను తీర్చేటట్టు కనబడింది. షుమారు 8 గం లవుతుంది. శాంతికిఅవసరమైన నిశ్శబ్దంతో తాండవించియుంది. జ్ఞానార్జనకనుకూలంగా విజ్ఞానం ఆరెమ్మలమీద తాండవించియుంది. మహాత్మా యిత్స్న రాత్రి 2 గంటలవుడు పట్టుకొన్నాం. మీ ఆవరణలోంచి పారిపోవడం మా పోలీసు చూడగలిగాడు. అతనివద్దనున్న వస్తువులను పరికించిచూడగా మీ చర్చివని తేలింది. ఇతన్ని అరెస్టుచేసి మీవద్దకు తీసుకొని వచ్చాం అనుమాటలు మాకు వినబడ్డాయి. వెంటనే లోనికి ప్రవేశించాం.

దొంగ చేతిలో ఉన్న వెండిపాత్రలు దీపకలికలు షుమారు 2000 రు. కిమ్మతు గలవిగా నున్నవి. అతడు జీర్ణించిన మొగంతో అమిత నిరువు చూపుల్లో చూడడం మొదలెట్టాడు. అతని మాసినగడ్డం ముడతలువడ్డ అతని శరీరం ఆవృత్తిలో కనబడే మనిషిలాగా కనబడలేదు.

కృపా ఎందుకలా నిర్ఘాంతపోతావు. దేవుని పూజకు కావలసిన పరికరములు కొన్ని మరిచావు. యిదిగో యివి కూడ తీసుకో. పరాత్పరుని ధ్యానించు. వాటివెలుగులో అతను ప్రసన్నవదనుడు అని మతగురువు పలుకరించాడు

పోలీసులారా అతనిని వదలివేయండి. ఆ సామాగ్రి నేనిచ్చినవి. అవి దొంగిలించినవి కావు అని మహాత్ముడన్నాడు.

పోలీసులు నిర్ఘాంతపోయారు. మహాత్మా యితన్ని వదలి పెట్టకండి. యితడొక పెద్దగజదొంగ.

అవును నాకు తెలుసు. నీకీ దొంగతనంలో భాగం లేదా?

మహాత్మా మీరిలా మాట్లాడితే మేమేమని చెప్పము. మేం బ్రతకడం ఎలా అండి!...సరె మాకిక సెలవు అని పోలీసులు వెళ్ళారు.

స్వామి: మీరు మహాత్ములు పూజనీయులు దొంగ దొంగా గజదొంగ అని ప్రపంచమంతా నన్ను విసర్జించి సంఘంనుండి వెడలిగొట్టినప్పుడు, మీరు నాకాశ్రయమిచ్చారు. ఏహోటలువాడు నాకన్నము పెట్టనప్పుడు మీరు సహపంక్తిగా భోజనము పెట్టారు. మీబట్లను నన్ను గజదొంగ నాకాశ్రయమీయకూడదని ఎంత హెచ్చరించినను, నాకు బంగారు పీటనిచ్చి, పింగాణి పళ్లెము మార్చి వెండి పళ్లెంలో భోజనం పెట్టారు. కాని నేను భోజనంపెట్టిన వారి యింటికే కూరల కన్నంపెట్టాను, నన్ను క్షమించండి. వీటిని గ్రహించే శక్తి నాకు లేదు. తీసుకోండి. అంధకారాన్ని త్రోలి

గించి జ్ఞానోదయం కలిగించాడు. ధనార్జన వైకల్యాలనే వ్యాధులతో బాధపడుతుంటారు. ప్రజలను, సంఘాన్ని, జయించాలనే పట్టుదల విసర్జిస్తారు. నన్ను మీ శిష్యునిగా పరిగ్రహించండి. నేనిప్పుడే సంచిపోతాను. అని కృపా మాతగురువుని బ్రతిమా లాడు.

ఆశ్చర్యము, నాకర్థమయింది. పగలు దోచే మోస గాళ్ళను, వ్యాపారస్తులకంటె నీవంతదొంగవు కావు. నీవు తినటానికి తిండి కట్టుకోడానికి గుడ్డ లేనిపరిస్థితులో ఈదొంగ తనం ప్రారంభించావు. సంఘం, అధికారులమీద నీక్రోధం నాకర్థమయింది.

కాని మహాత్మా పరిపాలన వారినెక్కువగా ధనార్జన చేయనివ్వదు.

పిచ్చివాడా. నీకు లోకం యింకా అర్థంకాలేదు. పరిపాలన కూడా వ్యాపారుల విధానమునే అమలువరుస్తూ ఉంటుంది. వారలా సంపాదించుకోవడం చాల అవసరము. లేదావారికి మనశ్శాంతులుండవు. నాకు తెలుసు. ఏదిఏట్లయినను నీవీరీతిగా తప్పువశ్చాత్తాపపడం, క్షమార్పణ కోరడం, సంతోషంగా వుంది. కాని పగలు దోచే వ్యాపారస్తులు వేరు. వారికి సరిపడు స్థితిగతులున్నప్పటికి లోకాన్ని దోచడం, సొమ్మును కూడబెట్టడం వారికది సహజలక్షణముగా పరిగ

శింపబడింది. పోనీ వారు జీవితంలో ఒకనాడైనా యిలా పశ్చాత్తాపబడడం ఉండదు. ఫరవాలేదు నీవు వారి కెంత మాత్రము తీసిపోవు. నిశ్చయముగా నీవు లోకాన్ని జయించగలుగు తావు. యిదిగో ఈ పుస్తకం తీసుకో. ఇది పరిశ్రమలు [illegible] జేసే మార్గం చెపుతుంది. ఒక పెద్ద ఫ్యాక్టరీ పెట్టించు. న్యాయము మగు లాభం ప్రజలనుండి పొందు. నిన్నాశ్రయించు వారికి సహాయం చేయడం మరచిపోకు, అని మాత గురువు వాతనికి కొంత ధనమిచ్చి సలహా చెప్పి పంపాడు.

ఆల్బర్టు: ఎలావుంది వారి విజ్ఞానం అని Skyes నన్ను ప్రశ్నించింది. నిజంగా నాకదో మార్గంగా మనసు మారింది. అతన్ని యింకా వివరాలు అడగాలనిపించింది. కృపా ఆగు! నీజీవితం పూర్తిగా వినాలని ఉంది. అని అనడంతో ఆమె అతన్ని కారులో కూర్చోడానికి అవకాశ మిచ్చింది. అతడు కారులో ఎక్కాడు. ముగ్గురం ఆప్రాంతంలో ఉన్న అరణ్యంలోకి ప్రవేశించాం. ఆ ఆవరణలో ఒక పెద్ద వృక్ష ముంది. దాని ఆకారాన్ని బట్టి 60 ఏండ్లనాటిదిగా కనబడు తుంది. దానిచ్ఛాయలో కొండరాళ్ళమీద కూర్చొన్నాము.

అతడు ఆప్రదేశంలో చిన్న యిల్లు నిర్మించుకుంటా నని చెప్పాడు. కొండనుండి పారుచున్న సెలయేరు, ఆప్రక్క నున్న పచ్చిక బయలు, అతని ఊహాల కనుకూలంగా పెరిగి ఉన్నవి.

అతను నా పేరడిగి తెలుసుకొన్నాడు.

ఆశ్చర్యంగావుంది నా జీవితం చూస్తున్న సమయంలో మీరు కనబడ్డారు. కాని నేనుండే స్థలం మీరెవరికి తెలియ పరచకండి. అని బ్రతిమాలాను,

కృపా నీవిలా దాగివుండటానికి కారణమేమిటి? అని ధైర్యంతో అడిగాను.

ఆశ్చర్యంగావుంది, నా జీవితమొక దుఃఖసాగరం. అంతులేని చిత్రవిచిత్రమైన గాథ. నా తల వెంట్రుకలు యిలా తెల్లబడ టానికి ప్రకృతి కారణం కాదు. శరీరం ముడతలు పడటానికి నేనొక ముసలివానికాదు. జీవంలేని జైలుజీవితం నన్నిలాకూల దోసింది. కట్టెలు కొట్టుకొని జీవించేవాణ్ణి. కర్మ కనుకూ లంగా జీవితాన్ని నడుపుకుంటూ వచ్చాను. యుద్ధానంతరం డిటెన్యూలుగా కొందరు స్నేహితులు, నేను అరెస్టుకాబ డ్డాము. నాకాప్తుడైన తమ్ముణ్ణికూడా జైలులో పెట్టారు. అతను ఆజైలులోనే చనిపోయాడు. వానికక్కడే సమాధి కట్టారు. ఆసమాధి వెలుపల కట్టమని బ్రతిమాలాను. చని పోయిన శవానికైనా స్వేచ్ఛయివ్వండని బ్రతిమాలాను. కాలం గడుస్తుండగా మాతల్లిదండ్రులు, స్నేహితులు కూడ మరణించారు జైలులో నేనొక్కడనే నిలచిపోయాను. అప్రా యంగా విడిపోయిన రాతినలుపు రంధ్రము నుండి సూర్య

కిరణమొకటి జైలుగదిలోకి ప్రవేశించేది. అంధకారాన్ని పోగొట్టే ఆ కిరణం నాకు ఆయువు పోస్తు ఉండేది. సాలీడులు, వెన్నెలలో స్వేచ్ఛ ననుభవించే చుంచెలుకలూ, నా సంకెళ్ళే నాకెప్పుడు పరివారంగా ఉండేవి. కొన్నాళ్ళు, రాళ్ళు, రప్పలను కొట్టి వాటిని చూస్తూ ఉండేవాణ్ణి.

కృపా దుఃఖభాజనమైన నీ జీవితం నేను వినలేకుండా వున్నాను. ఆ విషయం గురించి ప్రశాంతిగా అడగ దలచుకో లేదు. మంచిరోజులు వచ్చినవి కదా యికనైనా ఒకదాన్ని వివాహమాడ రాదా. ఈ మారదుష్టము నేడే దూరంగా పోతుంది. అని హెచ్చరించా.

ఆల్బర్టు నీవింకా పసివాడవు. అపారమైన జీవిత సాగరం నీకింకా అర్థంకాలేదు. నావలె ముసలి అయినప్పుడు ప్రపంచం అంటే నీకర్థమవుతుంది. జైలునుంచి విడుదల కాగానే సంసారం ఏమైందో అని వెదకటానికి మా వూరికి వెళ్ళాను. నేను జైలుకు వెళ్ళేటప్పుడు నా వదిన జబ్బుతో ఉండి మరణించింది. పిల్లలు ఆకలితో రోదన చేస్తున్నారు. ఆవిడ సమాధిపట్టి అంత్యక్రియలు జరిపి జైలుకొస్తానని అధికారుల ప్రార్థించాను. ఒకరోజు గడువిమ్మని బ్రతిమాలాను. నిర్జీవంగా, నిర్దయులుగా, వారు నన్ను అరెస్టుచేసి తీసుకొని వెళ్ళారు. మరల ౨౦ ఏండ్లనంతరం వాసిన పెదకటూరికి నేనా ప్రదేశానికి వచ్చాను. మా గ్రామం ఒక పెద్దవాగులో కొట్టు

కొని పోయిందన్నారు. పిల్లల గతి ఏమైంది అని ఒక ముదుసలిని అడిగాను. పేదవాళ్ళ సంగతి ఎవరికి పట్టిందయ్యా! అని అతను హేళన చేయడం మొదలెట్టాడు. లోకానికి పరాయి వారి సంసారం, దాని స్వరూపం, అవసరం లేదు. సంఘానికి ఆదరాభిమానములు అంతకంటే అంతరించినవని తలపోసాను.

పోని కృపా నాకో ప్రశ్న అడగాలని వుంది.

అడుగు ఆల్బర్టు.

చిన్నవాణ్ణి తెలియక అడుగుతున్నాను. చిన్నతనంలో నీకు పెండ్లి చేసుకోవాలని ఉందా, అని కఠినంగా అడిగాను. నేనా ప్రశ్నకు సమాధానం వినకముందే, Skyes నన్ను రమ్మని నిర్బంధించింది. ఆమె అలా నిర్బంధించడానికి కారణం నాకు తెలియవచ్చింది. వెంటనే కారులో పట్టణానికి వచ్చాం. నేనామె మాట కాదనటానికి వీల్లేకపోయింది.

కారులో ఉండగా నామనసు చిందర వందర పడింది. చంద్రుడు చల్లదనాన్నిచ్చి మనసును ఉత్సాహపరుస్తాడు. జ్యోతి వెలుగునిచ్చి వేడిని చేకూరుస్తుంది. పూవు వికసించి పరిమళంతో సుగంధ వాసనలు కురిపిస్తుంది.

కొంత సేపటికి చంద్రుడు మరలుతాడు. జ్యోతి ఆరి పోతుంది. పుష్పం వాడి రెమ్మనుండి రాలిపోతుంది. ఇది సృష్టి

రహస్యం. అంతులేని ఈ సృష్టి రహస్యం కనుగొనడం అసాధ్యం. వాస్తవికంగా అవీ అలా జరుగుతూ ఉంటవి. అని తలపోస్తూ ఈరహస్యం తెలుసుకోవడం ఎలాఅని విల పిస్తున్నా. నని ఈ కథ హోటలు ఎవరెష్టులో సుశీలకు ఆల్బర్టు చెప్పాడు. అది ఆనాటి నాఅవస్థ అని సుశీలతో అన్నాడు.

సరె: Skyes ను అనుభవించడం సంభవించిందా? అని ఆమె ప్రశ్నించింది.

అంతలో హోటలు కుర్రవాడు లోనికి ప్రవేశించాడు.

సుశీలా 12 గంటలయింది పడుకుందాం. అని తలుపులు చేరవేశాను. కుర్రవాడు వెళ్ళిపోయాడు.



# III

తెల్లవారు జామున 5 గం. లేచాం. కాలకృత్యాలు తీర్చు కోవడం తప్పకంతి వినుగు అనిపించలేదు. హోటలు మేనే జరును కబురంపాను. అతడు బిల్లు పంపాడు. బిల్లుసొమ్ము యిచ్చి మిత్రవాణ్ని పంపాను.

సుశీలా నాకిక సెలవు. నిన్ను విడచిపోవడానికి నామనసు అంగీకరించడం లేదు. మన పూర్వపు స్నేహితం మరపు రానిది. నీవు కాలేజిలో నాకోర్కె అంగీకరించక పోవడం నాకెంతో సహాయకారి అయినది, ఆవిషయమై నేనేమి చింతపడను. దయ కలగడం మానవుని ఉత్కృష్టమైన లక్షణం. గంగాధవాని వలె మేఘముల నుండి దాన్ని ప్రవ హింప చేయడం, ప్రతిమానవుడు వాంఛిస్తూఉండాలి. ఆవిధాన మెలవరచు వాడు గుణవంతుడు, చైతన్యమూర్తి అని పిలువ బడ్తాడు.

సుశీలా నీకొక సలహా యివ్వదలచు కొన్నాను. జీవి తం, సాక్షిగా జరిగేవరకు నీవొక ఉద్యోగంలో చేరు. మిగతా విషయములు అవంతటవే సర్దుబాటవుతవి. ప్రపంచంలో అనేక మంది ఫలితం ఆశించ కుండా, అమాయకంగా పనిచేస్తూ వుంటారు. జీవితం నడుపుతుంటూ కాలాన్ని గడువుతూ వుం

టూరు. కారణంలేని జీవితంలో కష్టాలెదురుకుంటూ, మున ణిస్తూ వుంటారు. వారి గతి ఏమైందో ఎలా పరిణమించిందో ఎవరికి తెలియదు. వారిని గురించి విచారించేవారే ఉండరు. భూగర్భంలో అలాగే అంధకారంతో అంతరించి పోతూ వుంటారు. ప్రస్తుతము నీవు ఈ విధానమును అలవరచు కోవాలి, అని 5. రు. నోటు ఆమెకిచ్చి వెళ్ళిపోతాడు.

తరువాత సుశీలగతి ఏమైందో ఎవరికి తెలియదు. రాజు వారి కథ అంత సూక్ష్మంగా పూర్తి చేయడం గుణకు రుచించలా.

పోని- ఆల్బర్టు, Sykes కథ-ఏవిధంగాపరిణమించింది. వారు పెండ్లి చేసుకొన్నారా? అని గుణ తండ్రి నడిగింది. తండ్రి రాజు, ఆల్బర్టు Sykes కథ చెప్పడం సాగించాడు,—

ఆల్బర్టుఒకనాడు నిశ్చయంగా తన అభిప్రాయాన్ని Skyes కు తెలియ పరచాడు. ఆమె దానికి సంపూర్ణాంకిత మన్నది. అతన్ని తనయింటికి సోమవారం రమ్మని నిర్ణయిం చింది. అంతకు ముందే గేవర్టు అనే పండితునికి మాట యిచ్చింది. అతడు ఆరోజుకు సిద్ధమవుతున్నాడు. "ప్యారిస్ డ్రస్" ముఖ్యముగా ఆమెకు కొన్నాడు. అవి ఆమెకు అలంక రించి కళాభిరుచిని అనుభవిద్దామని ఆశపడ్డాడు. తానొక కాబూలివాల లాగా తయారయ్యాడు. కాశ్మీరు వగనాలన్ని

గ్రుచ్చి, వాటిని పారేశాడు. ముత్యాలతో ఒకహారం ఆమె మెడకు తగిలించి చూడాలని దాన్ని, ప్యారిస్ నుండి తెప్పించాడు.

యథావిధిగా, కారులో ఆల్బర్టు సోమవారం రాత్రి 10 గం॥ Skyes యింటికి వెళ్ళాడు. గేవర్టు కూడా హాజరయ్యాడు. గేవర్టు ఆవరణలోకి రావటంతో తలుపు తాళం వేయించింది. చెలికత్తె "మిలా" అతన్ని, లోనకి రాకుండా ఆపు జేసింది. తమ్ముడొచ్చాడు, కొంత సేపాగండి అని చెలికత్తెతో Skyes కబురంపింది.

Skyes, కోమలమైన నీతనువు, నేలమీద గూలక ముందే, రమ్ము లతాంగి, మనమిద్దరము సుఖింతము. నీ వలనికి పోయినా, కొండకు పోయినా, నేను విడువను. నీపైట కొంగు నిరంతరము నిన్ను వలచినవార లెందరో నీబలి పీఠి చావనున్నారు. నేను, నేడు దొలంకి వచ్చితిని. రారమ్ము లతాంగి. తజ్జ్ఞులు, ఈ చెల వృత్తమును నమ్మరని సంశయిస్తున్నావా! అయ్యో! తనవు నేలంబడి, అవ్వల నానావిధ బాంధ బాంధికలుగా రూపములు ఎత్తకుండగనే మన మిద్దరము సుఖింతము. తుమ్మెద పువ్వుల వలె రాలిపోవుదము.

లోన మాటల శబ్దం విని, నిజంగా తమ్ముని రాకయే యని, గావర్టు ఆవరణలో నిలబడ్డాడు. చీకటి నిండుకొంది.

రాత్రి 12. గం|| అయింది. చలి గాఢంగా వేస్తుంది. చలి బాధ భరించలేక గేవర్టు ఆమె కొంటను కబురంపాడు. ఉండ మని జవాబిచ్చింది. పదే పదే కబురు జేసాడు. లాభం లేక పోయింది. వాన జోరున కురవడం ప్రారంభించింది. Skyes ఆల్బర్టుప్రపంచంలో మునిగి గేవర్టును మరచి పోయింది. అతడు వెళ్ళిపోదామని వాకిలి తెరువ బోయాడు- తాళం వేసి ఉంది, ఏమిచేయడం—— గోలకాకుండా ఉండాలి. అని ఆరాత్రంతా చలిలో గేవర్టు అలా బాధపడ్డాడు. శవంలాగా నిలచి ఉన్నాడు. తన దురవస్థ, ఆమెతమ్మునకు తెలియ కూడ దని పరితపిస్తున్నాడు.

ఆల్బరు నాయింట్లో జరిగే విషయం విన్నావా?

ఏమిటెది?

నా ఆవరణలో ఒక పండితుడు, కామానికి దాసుడై బంధింప బడ్డాడు.

నేను కాదుకదా!

హాహా! నా సౌందర్యం, నా సుఖం కోసం, అతడలా పశువై వానలో తడుస్తున్నాడు.

చలియూ, నీవు వానగా వర్షించునది. Skyes: నేను ఆగలేకుండా ఉన్నాను. ఆచీకటి గదిలోకి పోదాంపా...పోని ఆలాంతరైనా ఆరిపెయి. [ఆగు? అల్బర్టు-కామం పండితునికి కూడా కీడిస్తుందా? [Skyes-నీమాటలు నాకర్థంకావడం లేదు.

అల్బర్టు ! అర్థంకాదు. అర్థమయేటట్లు చేస్తాను. దృశ్యంగా చూపిస్తాను, అని ఆమె కిటికీతలుపులు తీసి గేవర్టును చూపింది.

వానలో అవస్థపడుతూ, చలితో, వణుకుతూ వున్న గేవర్టును, అల్బర్టు చూచాడు. కాని ఆ సమయంలో ఆతడలా ఊరుకోవలసి వచ్చింది. ఆమెతో శృంగారం అనుభవించడం, ఆనందాన్ని చవిచూడడం, గేవర్టు కళ్ళలో పడింది. కర్లైనా-హాయి- అన్న ఆమెమాటలు అతడు విని ఓర్చుకోలేక పోయాడు. తోకతొక్కిన తాచుపామువలె మండిపడ్డాడు. గిరగిర వడిగా తిరిగే బండ్రీచక్రంక్రింద బడ్డ మొండిబండ మిడత పురుగువలె ఆతని హృదయం చితికిపోయింది. తన్నిలా అవమానం పరచడం తనకు కాదు- తన పాండిత్యమునకే తలవొంపులని తలచాడు. క్రోధం వచ్చింది. కాని సిగ్గుతో తలవొంచుకున్నాడు.

సూర్యోదయమున తలుపులు తీయబడినవి. గేవర్టు అవమానంతో వెడలిపోయాడు. సౌందర్యానికి ఆటపట్టైన

పూలతోటలో ప్రవేశించాను. ఆ తోటలో నన్ను నాగు బాము నన్ను కాటువేయ వచ్చింది. విహరించు తేనెటీగల ఝుంకారము నాకవు డర్థమయింది.

అలా ప్రవర్తించడం ఆల్బర్టు చూసి ఎలాసహించాడు నాన్న? అని హేమ తండ్రి నడిగింది.

అమ్మాయి-ఆడవాళ్ళకి ముగ్ధలు కానివారు ఉండరు. ఆమెతో రమించి పగలు 10 గంటలకు తన కారులో ఆల్బర్టు వెళ్ళి పోయాడు.

అతడు యికమీద Skyes విషయమై తర్కించుకో లేదు. ఆ జాతికది సహజ లక్షణమని, తాను అసహజంగా ప్రవర్తిస్తే లాభంలేదని ఆమెను చూడడానికి పరితపించి, మరల ఆమె వద్దకు రావడం మానేశాడు. అతని కోసం Skyes అరవై ఉత్తరాలు వ్రాసింది. చివరకత్తె "మిలాను" పంపింది. అవన్నియు నిష్ప్రయోజనము లయినవి. ఒకనాడతడు ఈ విధంగా జవాబిచ్చాడు.

Dear Skyes,

మీ దేశం రావడం నాకెంతో జ్ఞానాన్ని ప్రసాదించింది. మీ సాంఘిక పరిపాలనకు నా అభివందనములు. మీవలె ప్రవర్తించేవారితో తిరగడం, వారి పరిచయం ఏర్ప

రించుకోవడం సహజంగా వున్నా ప్రస్తుతమునాకు అగౌరవమనిపిస్తుంది. మా భారతావనికి తలవొంపులయినట్లుంది.

బైబిలుతోడని పలికి,నీసౌందర్యపిపాసచే పీడింపబడుచున్న మన్మథాకారులను. వంచింపవూనుకొన్న టక్కరివి. నీకా సౌందర్యము సుఖమునివ్వజాలదు. భగవత్ గీతను, పంపుచున్నావు. ఎవడుసత్యవాక్య ముల్లంఘింపడో వాడే పో-నరుడు యుద్ధరామండలిన్ అన్న ఆర్యోక్తిని అది విశదీకరిస్తుంది. యిష్టమైతే అందలి ముఖ్య విషయముల కొంతవరకు అలవరచుకో

Yours Sincere ly,
Albert.

ఉత్తరం చదివిన వర్యతం ఫలితం ఏవిధంగా మారింది? అతణ్ణి వదలనంటూ ఆమె బాసచేసింది. ఆల్బర్టును విడచి ఉండటానికి ఆమె మనసు అంగీకరించలేదు. అందమైనవాడు, బాహు భుజములవాడు, వినయంగా ప్రవర్తించేవాడు, అవలీలగా పరిస్థితులను అర్థంచేసుకొని వాటి కనుకూలంగా సంచరించే వాడు. అతని కంటిచూపులో అదొక అహూయకం, ఆనందం నిమిడియున్నది. భావానుకూలంగా మనోవికాసం పొంది నామనసును రంజింప జేసేవాడు.

ఆల్బర్టు నిన్ను విడిచి ఎలా ఉండడం. ఓపరుగెత్తే మబ్బులారా మీరైనా ఆల్బరును రమ్మని చెప్పండి. నీకోసం నీప్రియురాలు కలువరిస్తుందని తెలియపరచండి. ఏనాటికైనా Skyes తన దేనని నుడవండి. ఇవే నావందనములు. సలాము లనండి.

మరల దూర దేశం భారతావనికి వెల్తాన్నాడేమో సముద్రాలు దాటి అతన్ని కలుసుకోవడం నాతరం కాదు. నన్ను నొకసారి చూసి వెళ్ళమనండి. పోని దూర దేశంలో నైనా నన్ను తలచుకుంటూ ఉంటే నాకదే పదివేలు. అతని చెలిని గని నిజమిదని తెలియపరచండి.

Skyes కొన్నాళ్ళు ఈవిధంగా ఆల్బర్టుకోసం పరితపించింది, చెలి మీలా కబురంపింది. ఉపాయం తెలుపమని బ్రతిమాలింది. ఆమె అలా క్షీణించడం మీాలా చూడలేక పోయింది.

అమ్మగారు గేవర్టు పండితుడే కాదమ్మా గొప్ప మేధావి. అతనికి భారతీయులను వశంచేసుకొనే మంత్రాంగ లన్ని తెలుసు. అరేబియన్ పారసీక గ్రంధాలు చదివి ప్రకృతి భూతాలను జయించే శక్తి సంపాదించాడు. ప్రతిభా

శాలి. ఇప్పట్టున ఆతని సలహా తీసుకోవడం మనకెంతైనా అవసరం. అని మిలా చెప్పింది.

పిచ్చిదానా! మనచే నికృష్టంగా చూడబడిన వ్యక్తి మరల మనకు సహాయపడతాడా!

అట్లు కాదమ్మా. కార్యం సాధించలేక పోవడం, అప్రయోజకుల చరిత్రలో ఉంటుంది. మనం పరాయివానితో విరోధం పెట్టుకోనేటప్పుడు అతన్ని గురించి మనం చాలా భయపడాలి. కాని అనివార్యంగా అతనితో విరోధమునకు దిగిన తరువాత అతడు మనలను చూచి భయపడేటట్లు చేయాలి. అమ్మగారు భయపడకండి. నేను ప్రయత్నించి చూస్తాను. మిమ్ములను కామించని వాడుండడు. మీ చూపులతనిని అవలీలగా ముగ్ధుని గావించును.

అమరునాడు. మిలా గేవష్ట యింటికి వెళ్ళింది. Skyes ను బ్రతికించాలని కోరింది. ఎలాగైనా ఆల్బర్టును రప్పించే ఉపాయమాలోచించమన్నది. Skyes పంపిన ముత్యాల హారం అతని భార్యకు కానుకగా యిచ్చింది.

కాలం తిరిగి రావాలి. పరిస్థితులు ఈ విధముగనే తారుమారవుతవి. కొందరకు అవి అనుకూలముగా తటస్థిస్తవి. కొందరకు వ్యతిరేకములవుతవి. వెతకబోయిన తీగె

కాళ్ళకు తగిలినట్లయింది. ఆడబోయిన తీర్థం ఎదురైంది.

లోకంలో పోలికలు కలుస్తూనే వుంటాయి. శ్రీగా వారి కుర్రాడికి నాకు ఏమి తేడాలేదు. రంగారావు కూతు ళ్ళలో లచ్చమ్మ ఏదో రావమ్మ ఏదో చెప్పడం దుర్లభం. మనం మాట్లాడం వాటిని గురించి తర్కించడం అనవసరం. పరాయివాళ్ళ కది అపార్థంగా పరిణమిస్తుంది.

మిలా నాకిపుడు ఆమెశోరమించడం నాకంతయిష్టంగా లేదు. ఆమెసౌందర్యం నన్నలా ప్రవేశించింది. అహా త్వర్నే కారంతో అంతరించింది. యిది మానవుని నైజము. కొన్ని సమయములు మానవుడు జీవితంలో పొరపాట్లకు లోనుగా వలసి ఉంటుంది. మన ఛాయ మనల నంటు రీతి మన ఫలితములు కూడా విధిని అనుకరించి యుండును.

ఆ సమయంలో నాకు బాధ కలిగినమాట వాస్తవం. కాని సంసారం నాకు జ్ఞానం ప్రసాదించింది. మానవు డెన్ని విధముల పెంపొందిన సంసారం పిల్లపాపలతో నివసించడం సుఖించి జీవించడం ఆనందించడం ముఖ్యావసర మనిపిస్తుంది.

మహాత్మా మా తప్పులు క్షమించండి. మీ సహకారం, సహాయం మాకెంతో అవసరం. అబలలము మమ్ము కరుణించి మా వాంఛలు తీర్చండి; చెరిగిన వాటిని మరల

స్మరణను తెచ్చుకొనడం ప్రాజ్ఞుల లక్షణము కాదు.

మీ సహకారం మేము పూర్తిగా వాంఛిస్తున్నాం.

మీరలా అధైర్య పడవద్దు. మీకు సర్వవిధముల సహాయం చేస్తాను నేను స్వయముగా వచ్చి ఆమెతో మాట్లాడెదను.

మహాత్మా మీకు మా అభివందనములు. ఏలినవారు రేపు వస్తారని తలుస్తాను. మీ మాటమీద ఆమె నిలబడి వుంది. నా కిక సెలవు.

గేట్సు తన పూర్వపు క్రోధాన్ని సాధించవలెనని నిశ్చయించుకొన్నాడు. మోసం. మోసంగురూ మోసం. ప్రపంచంలో మోసమనేది తాండవించి యుంది. కానికీ ఒకడు మోసంచేస్తే కాను కొకడు మోసంచేస్తున్నాడు. నాలుగు పావలాల సాల్వర్సా ఇంజక్షనుకు డాక్టరు నలభై రూపాయలు పుచ్చుకొంటే, మనోవర్తి దావా పోతుందని తెలిసికూడా లాయరు ఆఫీసులో దగ్గర ముందుగానే డబ్బు పుచ్చుకుంటాడు. కొద్దో గొప్పో మోసం అనేది లేకుండా బ్రతికేవా డెవ్వడు లేడు ఈ ప్రపంచంలో ఆ మోసం జీవనానికి సంబంధించిన ఆకలిమంటతో మలమల మాడేవాడెవ్వడు లేడు ఈ ప్రంపంచంలో. కాని యీ నా మనోవ్యధ అలాం

టిదికాదు. అంతులేనిది. అపారమైనది. పన్నెండేండ్లుగా విద్య నభ్యసించి పట్టభద్రుడ నయ్యాను. ఈవరకు ఆమె నాకా గౌరవము కూడా చూపించలేకపోయింది.

"మర్త్యమున కిక్కట్టైన సముద్రముల వేయిమూర్లు వేసినాడు." కాని స్త్రీ సహజాత మనే సౌందర్యాన్ని ఆవరించే మహా ప్రళయ దుర్భర సంగ్రామం, సముద్రము నన్ను మ్రింగవచ్చినది. ఏది ఏమైనను ఆమెను మోసంచేసి జయించవలెను. అని గేస్టు తీర్మానించుకొన్నాడు.

ఆ మరునాడు ఒక నల్లని పొడుగైనకోటు ధరించాడు. తెల్లని గుండీలు కోటును అలంకరించి మెరయుచున్నవి. ఒక నిండు తలపాగ అతని వర్చసు కొక క్రొత్త అందము చేకూర్చింది. జరి గల పంచినొకటి తొడగి కాశ్మీరు చెప్పులు కాళ్ళ కవధరించాడు. అతని చేతికర్ర వెదురుపాటిదైనను దాని తల పాము పడగవలె భయంకరమైన వికృతరూపం ధరించి యున్నది. ఆ కర్ర కళాపిపాసకులకు కొక క్రొత్త ఊహ నిస్తుంది. రసికున కొక రంకుని తాండవింప జేస్తుంది. గేస్టు కారులో ఈ విధంగా తయారయి, 10 గంటలకు Skyes యింటికి వెళ్లాడు. లోనికి ప్రవేశించి ఒక మెత్తని పాన్పుమీద కూర్చున్నాడు. ఆమె అతనికి పదార్థము లందించింది. వాటిని అతడు సునాయాసముగా భుజించాడు.

నీకేమి కావాలే బుల్ బుల్, అది సిద్ధంచేస్తాను-మంత్రాంగ లన్ని నా కరతలమవుతాయి. నా యీ గడ్డం చూడవే బుల్ బుల్, అది నా శక్తుల జనింపజేస్తుంది. ఇది కర స్పర్శ కాదే బుల్ బుల్, ప్రేమికుల హృదయ సంక్షోభాన్ని చేరదీస్తుంది. హృదయంలో ఉండే ప్రేమానురాగాన్ని ప్రజ్వలింపజేస్తుంది. నీకేమి కావాలే బుల్ బుల్ కోరుకోవే! పూజలన్ని సిద్ధంచేయాలే బుల్ బుల్.

గేవర్లుగారు మీ మంత్రాగాన్ని చాలించండి. నేను వినలేకుండా ఉన్నాను. నన్ను క్షమించండి. నా కోర్కె తీర్చండి.

తీరుస్తానే బుల్ బుల్, నీతో రమించి సుఖిద్దామనే కోర్కె నాకిపుడు లేదే బుల్ బుల్ అది విరమించుకొన్నానే! భయపడకే బుల్ బుల్. ఆల్బర్టుతో కలసి కాపరంచేయడం నాకెంతయు సమ్మతమేనే! బుల్ బుల్,

అవును మహాత్మా. పదేండ్లనంతరం నాకీ అనుభవం చేకూరింది. సంసారం చేయటానికి నిశ్చయించాను. వేశ్యా వృత్తి కడు నీచంగా పరిగణింపబడింది.

సంసారం నన్ను భోంచేయమంటుంది.

అలాగటే బుల్ బుల్, సెబాష్ బుల్ బుల్! నచ్చావే

బుల్ బుల్. కాని దానికొక నిబంధన ఉన్నదే. దాన్ని ఆచరించాలే !

అదేమి మహాత్మా!

సూర్యోదయం కాగానే నదిలో స్నానమాడి మొండి

మొలతో గోపరం ఎక్కి మూడుసార్లు సూర్యుని నమస్క-రించాలే! పడుచా

ఏమి అలా ఆలోచిస్తున్నావు. నీకార్యాం సిద్ధిస్తుంది.

నీవు కోరిన ఆల్బర్టు వస్తాడే! గారి.

ఆనియమం చాల కష్టతరమైనది మహాత్మా!

దానికి మరోమార్గం లేదే బుల్ బుల్. నామంత్రా లన్ని దాంట్లోనే సిద్ధిస్తవే! ఈరహస్యం ఎవరికి తెలియకుండా ప్రవర్తించాలే! బుల్ బుల్.

సరే మహాత్మా.

యిష్టమైన పని చేయటానికి ఎలాంటి నిబంధనలు

అడ్డురావు. ఈవిషయం మీలాకు తెలియకుండా ప్రవర్తించాలను కుంది.

గావర్తు, మహాత్మా! మంత్రాంగం ఉపదేశించండి.

మూడుసార్లు నమస్కరించిన తరువాత యీవిధంగా ధ్యానమొనర్చాలి అని గావర్తు ఉపదేశించాడు.

ఓపరాత్పరా కరుణామయి! మేకను పిల్లల కోడివలె పగలంతయు మనుష్యులను ఈలోకమున త్రిప్పుచుందువు. కాని మాయ అనెడి గ్రద్ద తన వాడియైన పాదాహతిచే ఆపిల్లలను తరిమి తల్లినుండి వేరుచేయటానికి ప్రయత్నిస్తూ వుంటుంది. ఈ సంక్షోభం నాకు సంభవించకుండా మాయనుండి వైదొలగించి నాపతిని చేర్చుము. నీపాదద్వయము మన్ని వేళల పూజించుచుండెదను.

ఆసమీపంలో రెండు మైళ్ళదూరంలో ఉన్న సెలయేరు వారి కార్యమున కనుకూలమయినది నిర్ణయింప బడినది. జన సమూహమునకు దాని నంటియుండు గోపరం ఆమె ధ్యానమున కుపయోగపడును. ప్రతిరోజు గొర్రె కాపరులు, గొర్రెలను మేపుకొనుటకై వచ్చుచుందురు. కొండప్రాంతమందలి పచ్చిక బీడులు వ్యాపించొందుట చేత వారికవి వాసయోగ్యములని గొర్రెల మేపుటకు వచ్చుచుందురు. కాని గుడిసెలను

నిర్మించి కాపురముండుట అరదు. వటవృక్షము కొండబురు జులు కోటభవనములు వారికి విశ్రాంతి నిచ్చెను. ఆసమీపంలో పూర్వపు భవంతి ఒకటి కలదు. దానినానుకొని ఒక సత్రము గలదు. బాటసారులు యాత్రికులు విశ్రాంతి కొరకు అటకు వచ్చుచుందురు. పూర్వ మెుకప్పుడది జీవంతో మెరసి యుండెడిది. కవులు, గాయకులకు పుట్టినిల్లై తరించుచుండెడిది.

కాని యిపుడా ప్రపంచం ఏమైంది. ఒక సత్రంగా మారింది. పండిత పామరులందరు కొన్నాళ్ళు దానియందు సుఖించి కాలగర్భమున కలసి పోయారు. పేదవారికి తావు యిచ్చారు. దాని కవాటము ఎప్పుడు రాకపోకలకు ఆలవాలమై అట్లే నిలచియున్నవి. అంతే. వేరులు తెగిన వంశవృక్షం ఊతం మీాద ఎంతకాలం నిలుస్తుంది, జీవించి నివసిస్తుంది.

Skyes గావర్సు మంచిరోజు చూచి ఆ ప్రదేశమునకు వెళ్ళారు. Skyes నదిలో స్నానమాడి. సిద్ధపరచిన ఆధారముచే గోపురం ఎక్కింది. సూర్యోదయకాలంలో పరాత్పరుని గురించి ప్రార్థించడం మొదలెట్టింది. చీకటిపోయి వెలుగురానున్నది. కాళరాత్రిని కాదు మిముచీకటిని భేదించు సూర్యుడు నిర్భయంగా తనకిరణముల ప్రకాశింపచేస్తున్నాడు. పాపం గ్యావర్సు ఏంచేసాడు. ఘోరం! కని వినరానిది, ఏంటది పాపం

ఆమె విస్త్రస్థయై గోపరంమీద యుండగా నిచ్చెన తీసివేశాడు. కక్ష తీర్చిందిన్నాడు. పండితులు శుంఠలు కారు పనులందు చతురులు, పండితుని అగౌరవపరచిన ఫలితమనుభవించు. అని నవ్వడం మొదలెట్టాడు.

సిద్ధిస్తాడే బుల్ బుల్! నీభర్త నీఆల్బర్టు అలాగా విస్తస్థయై పడియుండు నామంత్రాంగలన్ని పారాయే బుల్ బుల్! జయించానే గౌరి నిన్ను. సంసారం యిపుడెలావుంది. సానికొంప కెళ్దాంరా. అని పరిహాసంచేసి గావర్టు వెళ్ళి పోయాడు.

పాపం! ఆమె మానంకోసం పరితపించింది. గొత్తె కావరు లెవరైనా చూస్తారేమో అని భయపడింది, గావర్టు ఆగు నీవు పండితుడవు. మహా మేధావివి. ఈఅభాగ్యురాలు మొహనా నీసాహసము. నాసర్వస్వము నీకు ధారపోస్తాను. ఆల్బర్టు చెపలుడు నీవు మహాగుణశాలివి. నిన్నే వరించెదను. ఆనిచ్చెనను చేరవేసివెళ్ళు గావర్టు, గావర్టు అని కేకవేసింది. అతడు వినిపించుకోలేదు.

నావయసు ముప్పది యేండ్లు దాటినవి. శరీర పటుత్వము గ్రుంకుచున్నది. వార్ధక్యము రానున్నదా ఇలాంటి అచంచలమైన సౌందర్యానికి నీవింత పరితపించడం, కక్ష సాధించడం, అజ్ఞానం అవివేకం అమానుష్యం. అయ్యో! నావరి

భవనింతటితో సంతరించునా. రసహీనమైన కర్మం నాకీ పంకము యింక నావిషాదగీతములు రచించుటకే మిగిలి యుండెనా! కోటకూర విఖ్యాతపురుషులు కాదు. ఖ్యాతి నొందిన వారు కూడా నిన్ను వ్యర్థజీవిగా దలంతురు!

పొద్దెక్కుచున్నది. సూర్యకిరణముల వేడి ఆమె భరింపలేక వున్నది. మానం కోసం ఒక ప్రక్క కొరిగింది. పొరుగున రాయి వేడెక్కింది. 12 గ॥ లయింది. పైన సూర్యుడు తన వేడి కిరణములను ప్రయోగిస్తున్నాడు. నిర్దయుడుగా ఆమెను మాడ్చివేస్తున్నాడు.

ఈలాలసత్వము, కూృరకిరాతకత్వం అతనికెలా వచ్చింది తన పరివృత్తి మార్చి ఆమెకెందుకు సహాయపడడు. అంతా చోద్యము విపరీతంగా ఉంటుంది ప్రకృతి. కాని తనలక్షణం తాను చేసుకుంటూ ఉంటుంది. విధి అలా సాగిపోతూ వుంటుంది. పావం రోజువచ్చు గొఱ్ఱెకాపరులు కూడా ఆ నాడు తమ గొఱ్ఱెలను మేపుకొనుటకు ఆప్రాంతములకు రాలేదు.

సాయంత్రం 5 గ॥ గావర్టు మిలాయింటికి వెళ్ళాడు. Skyes, యింటికి తిరిగివచ్చిందా అని అడిగాడు, ఇంకెక్కడి Skyes యీపాటికి సర్వనాశనమై ఉంటుంది.

దేశానికి కరువొచ్చింది. భార్యను పోషించలేక వారి చేతిలో నున్న రొట్టె, నీరు గుంజుకొన్నాను. ఆకలి దాహంతో

బాధపడుతున్న పిల్లలనైనా చూచి ఆసీను, రొట్టె యివ్వ మని నాభార్య అడిగింది. నేనశహించు కొన్నాను. అలా పోయే రైతు ఒకడు నన్నడ్డగించాడు. ఓపశువా! నీవలా ఎందుకు బాధపడతావు. యింత కాఠిన్యం నీకెందుకొచ్చింది. యిలా లాక్కోడం మానవ సహజాతం కాదని హెచ్చరించాడు.

ఆర్యా నీకెలావచ్చింది ఈజాలి అని అడిగాను. నేనొక రైతును కరువురోజులు వచ్చినవి. పంటలు పండలేదు కప్పం చెల్లించక పోవడంచేత నాపాలేరు నన్ను నెడగొట్టాను. అని సమాధానమిచ్చాడు. .

హాహాహా అని నవ్వి తిండిలేని పేదవలంతా యిలాగే జాలి పడుతూవుంటారు. పట్టిపుట్టి పేదవ్రులు ఎవడి స్వార్థం వాడిది. నాపిల్లలు, నాభార్య గొడవనాకు పట్టలేదు. ఆరొట్టె నీరు త్రాగి వారిని మరణానికి పంపాను.

ఏమిటి గావర్టు నీవింత విపరీతంగా ఎప్పుడు మాట్లాడ లేదు. మీకిప్పుడున్న భార్య ఎవరు? మా Skyes పర్తింది, అని మిలాఅడిగింది.

ఆరోజే ఆల్బర్టు మిలాయింటికి వచ్చాడు. భారతదేశం పోతున్నానని తెలియపరచాడు. గేవర్టు పరిస్థితి అర్థంచేసు కొన్నాడు.

గేవర్టు నీకిలా పరితపించడం లోకానికి విపరీతంగా వుంది. పోని నన్ను నీమార్గంలో పెట్టండి వేశ్యావనిని వశ పరచుకొంటాను.

హా! నీవా ఆల్బర్టు. నీవు కాదుకదా నిరలాక్షుంతు కూడా నెగ్గించుకు రాలేదు. భూభరణ నివ్వా హారణార్థం పుట్టించిన జాతి అది. ఆజాతికి క్షుమధర్మాలు లేవు. ఏనుగంతటి వాన్ని పీనుగు చేయటానికి ఎన్నాళ్ళో అక్కరలేదు. కీకారణ్యంలో తిరిగే క్రూరమృగాల్లోనైనా కనికరమనేది కనబడుతుందేమో కాని హృదయాన్ని కంటుపరిచే ఆజాతి గుండెల్లో కంచు కాగడాల్తో గాలించినా కనికరమనేది కొంచమైన కనబడదు. అష్ట ఐశ్వర్యాలు కల్పించు, మృష్టాన్నం పెట్టించు, సృష్టి కాదన్నంగా ఉండే సౌధాన్ని కట్టించు. మరేమైనా చేయించు. చివరకు చేరదీసినవాణ్ణి చెరువులో ముంచడం ఆజాతి ముఖ్యలక్షణం అనిగుర్తించు. ఇందేదో అయింది. మరల నీవు యిండియాకు వెళ్ళి సంసారం చేసుకుంటూ వుంటే నేను విని చాలసంతోషిస్తా. తరువాత నీయిష్టం. అని గావర్టు సలహాయిస్తాడు.

గావర్టు లోకాన్ని కండ్లకు కనబడేటట్లు చూపావు. నీసలహాప్రకారమే వర్తిస్తాను. పాపం Skyes ఎక్కడుంది. మిలాకు తెలియపరచు.

ఆమె గోపరంమీద వివస్త్రయై పడివుంది.

ఆ! అక్కడికి వెళ్ళి ఆమెను కాపాడటానికి ఆల్బర్టు సిగ్గుపడ్డాడు. మిలాను వెళ్ళమన్నాడు. మిలా వెళ్ళింది.

గేకర్టు వెళ్ళిపోయాడు. ఆల్బర్టు Port హార్బరుకు వెళ్ళాడు.

మిలా బండిమీద గోపరంవద్దకు వెళ్ళింది. నిచ్చెన జార వేసి గబ గబ పైకి ఎక్కింది. Skyeకి దీనావస్థను చూసి పరితపించింది. సెలయేరు వద్దకు పరుగెత్తి దోసెలో నీరు పట్టుకొచ్చింది. నీరు తాపింది. మొహం తడిపింది, వంటినిండా నీరు జల్లింది. క్రిందనున్న గుడ్డలు తెచ్చి కప్పింది.

కొంత సేపటికి ఆమె తెప్పరిల్లింది.

అమ్మగారు నేను మిలాను. మీదుస్థితి విని వచ్చాను. మీగుడ్డలు కట్టుకోండి. లెండి పోదాం అని మిలాపలికింది.

మిలా విద్యుద్దీపముల నమ్మి ఆశాసౌధము కట్టికొంటి కాని అది నిస్సారపుటాకాశమై నాసర్వస్వమును హరించినది. నరకానన కూల్చినది. వృధాయాశ ప్రాప్తిగా నిలచి యున్నాను. ఆదుఃఖసాగర ప్రపంచంలో.

అమ్మగారు క్షమించండి. నేనలా అవుతుందనుకో లేదు. అతడొక స్వార్థపరుడు. పండితుడై పిచ్చివానివలె ప్రవర్తిస్తున్నాడు. పగిలిన మట్టిభాండము లాగా అతని హృదయం చితికిపోయినది. భార్యాపిల్లలను ఏడ్పించి మరొక దాన్ని పెండ్లాడినట్లున్నాడు.

మీలా విచారించను. కాముకుల కిదొక కఠోరపరీక్ష. గేపర్టును నమ్మివచ్చాను. అతడు మోసంచేసాడు.

అమ్మగారు విచారించకండి. ఆయాసం తీర్చుకోండి భోజనం చేద్దాం పదండి. తరువాత మాట్లాడుకుందాం. ఆడదాని మనోప్రవృత్తులే తెలుసుకోలేక పోయాడు. మీ సాక్ష్యానే భంగపరిచాడు. మనం పగ సాధించాలి. పదండి. జాగ్రత్తగా నిచ్చెన దిగండి.

మీలా ఆమె అసహాయస్థితి చూచి, ఆల్బర్టు అని కేక వేసింది. కాని అతడెక్కడ. యిండియాకు వెళ్ళిపోయాడు.

ఆమెను నిదానంగా మోసుకుంటూ చీకట్లో బండి మీద యింటికి తీసుకొచ్చింది. Skyes రొట్టె, పాలు త్రాగి ఆరాత్రి నిద్రపోయింది.

ఆమరునాడు కోర్టుకు ఎక్కింది. యిలాంటి కేసుల కింకను చట్టములు ఏర్పడలేదని, గేపర్టు నిరపరాధి అని

కోర్టు తీర్పు చెప్పింది. ఇదొక కొత్తరకపు కేసు అని జడ్జి నిర్ఘాంత పోయాడు.

చేతులు కాలినతరువాత ఆకులు పట్టుకుంటే ఏమి లాభం!

తదుపరి Skyes ఏమైందో, గేవర్టు, ఆల్బర్ట్లు ఏవిధంగా ప్రవర్తించారో ఎవరికి తెలియదు! అని రాజు తన కూతురు గుణతో అన్నాడు.



## IV

కథలన్ని అస్తమించినవి. సూర్యభానుడు పశ్చిమాద్రిన గ్రుంకనున్నాడు. ఆ రాత్రి గుణ రూప అనంతులకు రాజు హితబోధ చేస్తున్నాడు గుణా మనమారాధించు ప్రదేశమున ఒక కుర్చి ఖాళీగా ఉంటూవచ్చింది. మీతల్లి మరణించినప్పుటినుండి నేను మిమ్ముల గారాబముతో పెంచవలసి వచ్చింది. స్వర్ణ మీ పెంపుడు తల్లి. ఆమె నామాటకు ఎప్పుడు జవదాటి యెరుగదు. మీరుకూడా ఆమెవలె ప్రవర్తించాలి మన భాండారము నందలి పుస్తకముల చదివి విజ్ఞానంసంపాదించండి. వేళకు పూజచేస్తూ నన్ను సంతోషపెడ్తూ ఉండండి.

కొన్నాళ్ళనంతరం గుణ యుక్తవయస్సు రాలయినది. తండ్రిమాట కెప్పుడు ఎదురుచెప్పి యుండలేదు. అతనిని సంతోష పెట్టడం అందామె నిమగ్నురాలై యుండెడిది.

కానితండ్రి గుణ వివాహవిషయం తలపెట్టేవాడు కాదు. విజ్ఞానం, లోకజ్ఞానం అంటూ కథలన్నీ చెపుతూ వచ్చాడు. వాటికర్థం ఆమె గ్రహించలేక పోయింది. ఒక నాడు స్వర్ణ గుణ పెండ్లివిషయం రాజుతో హెచ్చరించింది. తండ్రి సమాధాన మివ్వలేదు. దిగులుపడి మంచం పట్టింది. తండ్రి డాక్టరును పిలిచాడు.

డాక్టరుగారు ఈ బ్రాంది వదిలే ఉపాయం చెప్పండి.

అది మానడం యిప్పుడంత మంచిది కాదమ్మా. మీ ఆరోగ్యం చెడుతుంది. మందులో అనుపానంగా తీసుకోవడం మిమ్మల్నంత బాధపెట్టదమ్మా!

అలాకాదు డాక్టరుగారు. దానివాసనే నాకుగిట్టదు. పోసి మందులో వాడుతున్నానని మానాన్నతో చెప్పండి త్రాగమని నన్ను బలవంతం చేస్తున్నాడు.

అమ్మాయి నీవు బ్రాంది మానవచ్చు. మీతండ్రికి నేను సమాధానం చెపుతాను. కాని నీవాసీసా బల్లమీదనే ఉంచాలి.

సరే. అనిగుణ ఒప్పుకుంది. పాపం దానివాసన గిట్టదు. బ్రాంది ఆమెకు మనశ్శాంతి యిచ్చి జబ్బు త్వరితంగా నయం చేస్తుందని రాజు తలపోశాడు. కాని ఆమెవివాహ విషయం ఆలోచించడు. ఆమెకది తీరని బాధఅయినది. కాని గుణ అంటే రాజుకు అమితమైన ప్రేమ. ఆమెనుచూడకుండా ఒక రోజైనా ఉండలేడు. ప్రచారం కోసం బైటకు వెళ్ళిన రెండురోజులలో తిరిగి వస్తాడు.

గుణ తనజీవితమంతా ఆగదిలోనే గడిపేస్తూంటుంది. గదిలో విచారిస్తు కుర్చీలోకూర్చుని బైట చంద్రుని చూస్తూ ఉంటుంది. కిటికీపైన అల్లుకొని యున్న లత ఆమెకు విశ్వాసం కలిగిస్తూ సంతోష పెడుతూ ఉంటుంది. పుస్తకములు చదవడం పద్యములు వ్రాయడం అలవరచుకుంది.

చెలి రూప గదిలో ప్రవేశించి గుణా నేను ఈరోజు సముద్రానికి వెళ్ళాను. సురేషుకూడా వచ్చాడు. చేపలుపట్టే వాళ్ళని చూశాం. వాళ్ళు మమ్మల్ని బోటుమీద ఎక్కించుకొని సముద్రంలోకి తీసుకెళ్ళారు. ఆ కెరటాల ధాటికి తాళ లేక బోటు అటుయిటు కొట్టుకుంటూ వుంది. మేమొకసారి, ఆకాశంలోకి లేపబడ్డాం. మాఆశయాలు, ప్రేమాంకురములు చిరునవ్వులు నవ్వుతున్నవి. మేఘాలు మమ్మల్ని ఆహ్వానించాయి. క్షణబంగురంలో మరల కెరటాలు మమ్మల్ని ఆస్థానం నుండి దించి ప్రపంచానికి తీసుకొచ్చాయి.

చెలి! ఏమి నీవర్ణన పొరపాటున అతన్ని ప్రేమించ లేదు కదా!

అమ్మగారు. రూప అతన్ని ప్రేమించి ఉంటుంది. అతడు చాల అందమైనవాడు. అని చెలికత్తె చెంప అంటుంది.

అతనికళ్ళు. అతని ముఖం, ఆతని శరీరం అబ్బా మరీ బాగుంటాయి,——

ఆగు! చెంపా! అతడంత అందగాడు కాదు! నీకళ్ళు గాండా భ్రమిస్తున్నవి.

అవునమ్మా. అతడు గుణానందుడు. మిల్లరిలో ఉద్యోగం అట.

చెలి వేటగాండ్రని చూశాం. వాళ్ళు జింకలనుపట్టారు. అవి తహతహ పడుతున్నవి. ఆ ఆవేదన చూడలేక పోయాను. పరాయి చేతులో చిక్కడం వాటికి క్రొత్తగా వుంది.

రూపా. విచారించకు. ఈసంగతి నాన్నకు తెలియ కూడదు. మీ ప్రేమానుబంధం త్రుంచివేస్తాడు.

అయితే గుణా. నాపెండ్లిసంగతి నాన్నతో మాట్లాడవా.

అలగే మాట్లాడుతాను. ఎంత అమాయకురాలవమ్మా నీస్వేచ్ఛకు అడ్డువస్తానా! నాది నీలాంటి నీజీవితమే రూపా! మనమిద్దరము ఒకతల్లి కేవుట్టామన్న మరచిపోకు! దిగులొందకు.

గుణా నీవు పెండ్లి వద్దనుకున్నావుగా.

అవును. 30 వండ్లనంతరం నాకు పెండ్లి ఎందుకు. నాయవ్వనం, నాసౌందర్యం, నాఆనందమంతా ఈమంచంలోనే

క్షపించి పోయినవి. ఇక నాకుమిగిలినది ఈవిషాదగీతికలేగా!

గుణా. నాజీవితంకూడా నీవలె పాడుచేస్తావా.

అట్లనకమ్మా. ఆవిధంగా జరుగనేరను. నాలాంటి జీవితం పరాయివాళ్ళకైనా వొద్దమ్మా! సురేషుని నేను గౌరవిస్తాను. కాని ఒక విషయం. మీరు సముద్రానికి షికార్లుగా అక్కడ చేపలు పట్టే వారికున్న స్వేచ్ఛ, విలాసం, నాకుంటే నేనీగడియలో మీకు పెండ్లిచేసి మిమ్ముల్ని అనంద పరుస్తా!

అయితే నన్ను తండ్రిని ఎదిర్తించి అడగమంటావా?

నీకంత సాహసముంటే నేను కాదనను.

తమ్ముడు అనంతుడు ప్రవేసిస్తాడు— రూపా సురేషు నీకొరకు వచ్చాడు.

చెలి సురేషుని చూపించమంటావా!

సరె. లోనికి ప్రవేశపెట్టండి.

సురేషు లోనికి ప్రవేశిస్తాడు. రూప అతని కోటు గుండీలను సవరిస్తూ ఉంటుంది. గుణ ఆదాంపత్యము చూసి మురిసి పోతుంది.

తుపాను — ఎందుకు— తండ్రి ప్రవేశం.

గుణా ఏమిటది. నీవిలా ప్రోత్సహించడం నాకవమాన కరంగా వుంది. పరాయివాళ్ళను రానివ్వద్దనలేదు. రూపా ఎవరీతడు,

అతని పేరు సురేషు. మిలటరీలో ఉద్యోగం. రూపను చూసిపోవడానికి వచ్చాడు.

అవును. నాన్న అతన్ని నేను ప్రేమించాను, అతడు నన్ను ప్రేమించాడు. మీమాటకొరకు ఎదురు చూస్తున్నాం.

సురేషుగారు మీరు వెళ్ళండి. యికమీద మాయింటికి రాకండి. సురేషు వెళ్ళటానికి సిద్ధంయించు కుంటాడు.

రూపమొహం చిన్నపోయింది, అనంతునకు, గుణకు కోపం వచ్చింది.

నాన్న నీవిలా అగౌరవపరచడం నాకెంతో అవమాన కరంగా వుంది. దుఃఖమేస్తుంది. నాజీవితం యిలా దుర్భరం చేయడం నేను సహించి ఊరుకున్నాను. 20 ఏండ్లు ఈప్రపంచం మీద గాలి ప్రసరించాను. నీవెవ్వడు నాపెండ్లి

మాటే తలపెట్టలేదు. నాసరస్వం నాఆనందం నీమూలాన్న కూలింది. కాని రూప జీవితం అలాచేయకు— నేను సహింప.....

గుణా నోరుమూయి. రూపా నిన్ను చంపేస్తాను. అనంతా నీవిలా ప్రోత్సహించడం నాకు గిట్టదు. జాగ్రత్తగా మెలగండి. అని రాజు గద్దించాడు. అందరు భయపడ్డారు. రూప క్షమార్పణ యివ్వనన్నది. తండ్రి కొట్టాడు. ముగ్గురు యిలా ప్రవర్తించమని మరల తండ్రికి ప్రమాణ మిచ్చారు.

మీాయింటికి వచ్చే అవసరం నాకులేదు.

మరెందుకు వచ్చారు!

స్వర్ణ రూపలకోసం— కొండకు వెళ్లిమన్నారు. పిలుచుకొని వెళ్ళటానకి వచ్చాను.

స్వర్ణా, కొండకు వెళ్తానన్నావా.

అవును. బాబుగారు.

ఎందుకు?

పరాత్పరుని ధ్యానించుటకు.

స్వర్ణా. నీవుకూడా నన్ను దిక్కరిస్తున్నావా. నాఅను మతి లేకుండా మీారికముందు కొండకు వెళ్ళకండి జాగ్రత్తగా మెలగాలి. లేదా— మీాప్రాణాలు దక్కవు.

సురేషు మీారిక వెళ్ళవచ్చు. మాఅమ్మాయితో మీారేవిధమైన సంబంధ బాంధవ్యాలు పెట్టుకోకండి. నేను అసలు నాకూతుండ్లకు పెండ్లేచేయను. నాకు ఈలోకంమీాద విసుగు పుట్టింది. కుటుంబంలో ఆడపురుగు రాలితే దాన్ని వాసన చూడని వారుండరు.

ఇదేమి! మీారట్లనుచున్నారు. స్త్రీలు యిండ్లలో నుండు పశువులవలె మేత మేయుటకేనా, మానవత్వము లేదా? మీామాటలు చోద్యముగనున్నవే, యివి స్వార్థం కొరకు ఏర్పరచుకొను సూత్రములనుకుంటాను. మీాయట్టి సాహసము గలవారిని నేనేగ్రామంలో చూడలేదు. మీాయు క్తికి మించిన వారుండరు, ఈలోకంలో!

నీవామెను కామించి భోగించుటకు ఈయుక్తి పన్ను చున్నావు. ఓ కులద్రోహి! నీవామెతో రమించి, రంకు తేనున్నావా! నాకుటుంబానికి. అయ్యో ఆమెకెట్టి అపవాదు, అపనిందయు రానున్నవో!

లోకమిత్రా యోచారుము. దాని నిజము నేను

గుర్తెరింగియే యున్నాను. ఏలఅపనింప రాకుండా నేనిపుడే ఆమెను వివాహ మాడెదను. చేరి నమ్మిన స్త్రీని చెఱచు వాడు ఘోరపాతకి కంటెను క్రూరతముడు యను లోకోక్తి మీరు వినలేదా!

ఆ! అన్ని ఎరిగియే యుంటిని. తెలియని వానికైనా చెప్పవచ్చును. పూర్తిగా తెలిసినవానికైన చెప్పవచ్చు. కాని తెలిసి తెలియని వానికి చెప్పడం కష్టసాధ్యం.

ఆర్యా. ఎవటవాని మర్యాదనెఱిగి వారిచే తాను మరియాద, పడయవలయును. తొలుత వానిని గౌరవింపకున్న తమకు గౌరవమబ్బదు. ఇది నిజము.

అట్లను దొంగతనమునకు ఈమార్గములన్నియు అలవరచు కొనవలయును.

ఆర్యా! దొంగతన మనునది సామాన్యమైనది కాదు. దొరపట్టి శిక్షించు. నిను పొరుగువారు ఎగ్గులెంతురు.

నీవు నాలుగు సూత్రములు నుడివినంత మాత్రమున వారికన్న ప్రాజ్ఞుడవయితివా. యిది నాస్వగృహము. నిన్నిదే పోలీసులకుఒప్పజెప్పెదను. మర్యాదగా యింటినుండి వెడలిపో.

ఓరి కులద్రోహీ! నేడే చచ్చితివిరా. నీవు కుటుంబ నాశనమునకైనా సిద్ధపడెదవు కాని నీపట్టుదలను వదలవు. యిది నీనైజము. నాకిపుడర్థమయినది.

గుణ అడ్డువచ్చింది.

ఆర్యా, శాంతించుము. కృపామయా దయనుమించిన ధర్మము ఈ ధరణిలో లేదు. వెదకిచూచినదానికి వేరొకటి నాటిరాదు. "అహింసా పరమోధర్మః" అనుట మీరు వినియుండలేదా? మిమ్మల్ని నిందించాడనే ఆ వేశంలో పొంగిపొరలే మనోవ్యథ ఉపశమించుకోలేక ఏ మూర్ఖాహంకారం తలపెట్టిన దాని ఫలితంగా మేమనుభవించు దుఃఖము అపారము. శాంతింపుడు. మాతండ్రి మనోభావములు మారువరకు మేము యీ విధముగనే మా జీవితముల గడుపుకొనుచుందుము. అనంతా వీరిని దిగవిడిచిరమ్ము. చెంపా మనబండిని వారికి ఆయత్తపరుపుము.

ఆ మరునాడు రాజు వూరువిడచి వేరొకచోట మకాం పెట్టదలచుకొన్నాడు. అన్నివిధముల వాసయోగ్యమైన అజంతాపురం చూడడానికి వెళ్ళాడు. గుణకు యింటిసర్వాధికారం ఆసారి యిచ్చాడు. వారంరోజులలో తిరిగి వస్తానన్నాడు. అతను పోవటంతోనే—

గుణను చూడటానికి జీవన్ ఆమెయింటికి వచ్చాడు.

అతడొక కవి. అతని రచన సెగలు పొగలతో కాల కూటవిషం కక్కుతూవుంటుంది. హృదయోద్వేగమూ, ఉద్రే కమూ ఉట్టిపడుతుంది. ముత్యాలసరాలు వ్రాస్తాడు. వీర రసప్రధానమైన ఘట్టముల హృద్యమైన సంభాషణా శైలితో చిత్రిస్తాడు. ప్రసన్నకథా, కవితార్థయుక్తిగల పదాలు పర్చి కవి రసజ్ఞుల కంజలిబట్టి గిలకరించి యిట్టే నిక్షేపింపగా సొంపు సముదాయములు కనపడునట్లు రచిస్తాడు. ప్రతి పద్యములోని భావమూ కొండకోనలలోనుండి వెలువడే ఒక సెలయేటిలాగా తనంతట తాను అప్రయత్నముగాను, సుకరముగాను మెలచుకొంటూ పోతుంది.

అతని రచనలయందు ఆమెకు అభిమానము మెండు. అతన్ని ఎక్కువగా గౌరవించింది. జాలి, కరుణ గలిగిన హృదయంతో అతడా గౌరవాన్ని స్వీకరించాడు. అతను రచించిన 'నిట్టూర్పు' అనే పుస్తకమును తెరచి అందలి కొన్ని పద్యములకు అర్థమడిగింది. అతడామెకు సరియైన సమాధాన మివ్వలేకపోయాడు.

గురూ మిమ్మల్ని నేనిదే చూడడం. మీ పద్యాలు, కావ్యాలు చదివినప్పుడెల్లా మీ సాంగత్యమేర్పరచుకోవా లనుకుంటూండేవాణ్ని. ఆసదవకాశం నేడు సంప్రాప్తించినది.

మీకు నాజోహారులు, కాని మీరీవిధంగా క్షీణించి

మంచంలో కూలిపోవడం నాకిష్టంలేదు. మీ అమాయక జీవితం నన్ను ఆకర్షించింది. మీ ఆనందంలో నేను పాల్గొంటాను.

కవీంద్రా వలదు. నావయసు మీరినది. మీకు నాతో సంసారసుఖం అనుభవించలేవు. నేనీస్థితిలో మీకేసహాయము చేయజాలను.

గుణా విచారించకు. మనం రంగూను వెళ్దాం. అక్కడ నీఆరోగ్యం బాగుపడుతుంది. నీవయసుతో నాకు నిమిత్తము లేదు. నీకావ్యములు, మాటలు నాకు జీవం. నిస్సారమైన నీ జీవితానికి నేనొక సారవంతమైన మార్గంచూపి నేనాసుఖంలో నిన్నానందపరుస్తా. నీవు నావెంటరావలెను. ఎన్నికష్టాలు వచ్చినా మనమా మార్గంలో సముద్రయానం చేద్దాం. లెమ్ము నన్ను పరిగ్రహింపుము.

జీవన్ నీవు ప్రాజ్ఞుడవు. కాని నాతండ్రిని వొప్పించడం ఎలా. అది అంత సులభసాధ్యంగాదు.

దానికొక మార్గం కనిపెట్టాను.

ఆనాడు వారంరోజులవరకు రానని చెప్పినరాజు మూడు రోజులలోనే తిరిగివచ్చాడు. గుణను వదలి అతడు ఎక్కువ

రోజులు ఉండజాలదు. బండి గళ గళ మంటుంది.

గుణ చెంపను హెచ్చరించింది. "బాబుగారు" అని చెంప సమాధానమిచ్చింది.

గుణ జీవన్‌తో మాట్లాడడం రాజు చూచాడు. కాని అతడు యీసారి ఆమెను మందలించదలచుకోలేదు. పట్టణం మార్చాలనుకున్నాడు. పల్లెటూరు అజంతాపురం నిర్ణయమయింది. కావున గుణను యీసారి క్షమించాడు.

జీవన్ రాజుకు నమస్కరించి వెడలిపోయాడు......

రూప పర్వతశిఖరమున కూర్చుండి తండ్రినిగురించి దీర్ఘంగా ఆలోచించుచుండెను. కొందఱు లోకమున గంతుచు కొందఱు ఎగురుచు, కొందఱు మొగ్గలు వేయుచు లక్షలు, లక్షలు మానవులు కిచకిచ చకచక లాడుచు పట్టణమునకు వచ్చుచుండిరి. వారిలో కొందఱు పొడవైనవారు, కొందఱు పొట్టివారు, కొందఱు లావైనవారు, కొందఱు సన్ననివారు, కొందఱు ఎఱ్ఱనివారు, కొందఱు నల్లనివారు ఇట్లు పలువిధములైన వర్ణములు, రూపములు గలిగి సంతోషముతో అలరారుచుండిరి. కొన్నిపట్టణములు రమ్యముగా జనులచే నలంకరించియుండినవి. వీధులు పన్నీరుదడిపి, పువ్వులుచల్లిరి. ప్రతి యింటను తోరణములను, జెండాలను కట్టెరి, ఎల్లచోట్లను

మంగళధ్వనులు వీనులకు విందుచేయుచుండెను.

సురేష్ రూపకోసం ఆకొండపైకి వెళ్లెను.

రూపా, ప్రపంచమిప్పుడు మన మనుకొన్నదానికంటే హెచ్చుగమున్నదే! యీసాంప్రదాయము గలవారందరు నిప్పుడీ దేశమున ఎంతకాల మిట్లు నిలచియుందురు. ఎవరైనా ధనమునకు, వాణిజ్యమునకును పట్టుదల వహింతురు. కాని మీనాన్న లోకానికి విపరీతమైన కాంక్షగలిగియున్నాడు. ప్రకృతిని అరికట్ట బ్రహ్మవశమే!

అనేకవంశములు బయలుదేరినవి. అనేకములు నశించినవి. మరి మీనాన్న మనసు మారనేలేదు.

అవును, సురేష్ ప్రజలంతా ప్రేమకోసం వివాహములు జరుపుకొనుచుండ మన మీసంఘమునుండి వెలివేయబడితిమి. మనలను వారు గౌరవించరనుకుంటూ, చేయునదేమున్నది. మనము పరాయినుండే జీవితముల అంత మొనర్పవలయును.

చింతించకురూపా కష్టాలు కలకాలం కాపురముండవు.

అవును సురేష్ శరత్కాలోత్సవము కడపడిదినములు సమీపించినవి. యిదియే విజయదశమి. ఆదినమున దేవాళ

యములన్నిటను మహోత్సవము జరుగును. శ్రీమంతులగు వార లందరియిండ్లను బూజలు జరుగును. సూర్యోదయకాలమున స్త్రీలు శతశతంబులుగవచ్చి గంగాస్నానములు చేయుదురు. చిన్నపిల్లలు వందలకొలది ప్రోగుపడి సంగీతముల బాడుకొనుచు వీధులవెంట వాహ్యాళి జనుచుందురు. దంపతులు ఉత్సాహపూరితమైన హృదయములతో మసలుచుందురు, మన చిన్నపట్టణమేమూఁజూచిన నీరీతి మహావైభవములతో మహానందనిమగ్నమై అలరారుచుండును.

ఆరోజులు రావటం మహాకష్టతరములయినవి రూపా. మనదినమవుడు పర్వదినముగ పరిగణింపబడుతుందేమో!

అటులయిన మనము యీవిధముగనే అంతరింపవలసిన దేనా.

కొంతసేపటికి ఆమె పూర్తిగా తెలివికివచ్చింది.

రూపా నీకు ఏడ్పుఇష్టమా, నవ్వు ఇష్టమా అని సురేష్ అడిగాడు.

నాకు నవ్వే ఇష్టము అని రూప సమాధానమిచ్చింది.

పిచ్చిదానా నాకు ఏడ్పుఇష్టము. ఆఏడ్పులో ఎంత హాయినా ఉంటుందనుకున్నావు. ఏడ్చినపు డుద్భవించే కన్నీరుతో హృదయమంతడుస్తుంది. అందులో మొలకెత్తిన ప్రేమాం

కరములు సుస్థిరముగా నిలబడుతవి.

అనంతడు రూపా అని కేక వేసెను. రూప కొండదిగి వచ్చింది.

పొద్దుగ్రుంకు సమయమైనది. పిల్లలందరు నిసుకలో నాటలాడుచుండిరి. పచ్చగనుండు వరిచేలు దాటి యింటికి వచ్చియుండిరి.

వారు సమీపంలో ఉన్న బాదంచెట్టును చూచారు. దాని కొమ్మలకంటియుండు పండుటాకులు కొన్ని రాలినవి. వాటిని వారు వింతగా చూచారు.



# V

మాసములు రోజులు గడచినవి. రాజు తన ప్రయాణము నకు కావలసిన పరికరము లన్నియు సమకూర్చుచుండెను. అనంతుని తీసుకొని ఎడ్లబండి మాట్లాడుకొని వచ్చాడు. అజంతాపురము అతని కుటుంబము వెళ్లుటకు నిశ్చయమయి నది. కుటుంబమునకు కావలసిన సదుపాయము లన్నియు రాజు ఆపల్లె యందమరచి ఉంచాడు. పట్టణవాసం తన వంశ నాశనమునకు కారణమని, పరాయివాళ్లు వారి సంబంధం క్రొత్తచోట అంతెక్కువగా ప్రజ్వలింపదని తానప్పుడే వూరు వదలదలచుకొన్నాడు.

ఈమార్పుకు అందరు యిష్టపడ్డారా. రూప రావడానికి యిష్టపడలేదు. తండ్రి గదాయించాడు. గుణ అద్భుతగిలినది.

ప్రేమస్వరూపం ప్రేమించడం నీవు పూర్తిగా గ్రహించ లేదునాన్న. నీవుచెప్పిన కథలన్నీ కలలపాలయి పోయినవి. నీ వింకను ఆంగ్లేయభాషయందు శృంగార వచన ప్రబంధములు రచించిన రైనాల్డును, పీరశృంగార మిళితంబగు చారిత్రక విషయముల పొందుపఱచిన స్కాట్టును దృష్టియందుంచుకొన వలయును.

తండ్రీ! పూవు పుట్టగనే పరిమళించును.

వారి ఆంతరంగిక భావముల గ్రహించినపుడెల్లా నీవొక స్వార్థపరుడుగ ఈలోకమున పరిగణింపబడుతున్నావు. యింకను అగ్రాకోటయందలి అంతఃపుర రహస్యములును, పురుషుల ప్రవేశము, కరుణారసము లందలి విశేషములు చిత్రించిన స్కాట్టు అతని ప్రతిభ వేనోళ్ల కొనియాడదగియున్నది. ఆపుస్తకములను పూర్తిగా చదువవలయును నాన్న! ప్రపంచనడవడి ఏదో ఒక మార్గమున ఊహించి అలాప్రవర్తించడం సమంజసము కాదు. సరియగు పరిస్థితు లున్నంతకాలము ఆమె హృదయం వెన్నపూసలాంటిది. ఆ పరిస్థితులు వ్యతిరేకించినపుడు ఆమె మనసు పాషాణముగా మారును. ఆమె పరివృతిస్వేచ్ఛాను వర్తిని అనుకరించుచుండును.

రూప, సురేషుల దాంపత్యము సక్రమమైనది. పతి ప్రతాపమతల్లుల హృదయమందలి మనోవికాసమును వారియెడ తాండవించియున్నది. వారి పెండ్లి వెంటనే జరుపవలయును.

గుణా! సంగతులు నాకంటె మీకు బాగుగా తెలియును. అవి నీపరిముఖమున నే వినవలెనని యింతకాలము ఓపికపట్టితిని. గుణా నీమనసు నొప్పించుట నా అభిమతముకాదు. నిన్ను చెరసాలలో పెట్టడం నా కేవిధమైన సంతోషమును చేకూర్చదు. కాని నీ నింకను పసిపాపవు. ఇట్టి నిదర్శనము లింతకు మున్ను నాజీవితమున ఎన్నియో జరిగినవి. నాహృదయమును బట్టి యోచింపుడు. నేను చిన్నతనమున మీ అమ్మను పెండ్లా

డాను. ప్రపంచం తెలియనిరోజులవి. ప్రేమ, కామం రెండూ తటపటపడే వయస్సుకాది. మేమిద్దరం ఆ ప్రేమలో రెండు సంవత్సరములు గడిపాము. దానిఫలితంగా నీ వుద్భవించావు.

తరువాత! తరువాత!

తరువాత చెప్పేదేమి? మా సంసారంలో తుపాను ప్రజ్వలించింది ఒకనాడు మీ అమ్మను కొట్టాను. ఆమె అప్పటినుండి నేనంటే భయపడి ఉండేది. ఏ పనైనా అతి భయంతో వణకుతూ చేస్తూ ఉండేది. అప్పటినుండి మే మిద్దరము ఎప్పుడైనా మన్మథాకారంలో ఉంటే ఆమె భయంతో నాపంచ నిలబడేది. ఆమె ప్రేమానురాగం, నాలోనున్న కామం భయకంపితము లయినవి. తరుపరి జన్మించినవారు రూప అనంతులు. వారా సాంప్రదాయమునకు, జడించుటచే పిరికివండ్లైరి. మీ అమ్మ ఆ దిగులుతో మరణించినది.

నన్ను దుఃఖసాగరమున ముంచివెళ్లినది. కుణా, కవులు జీవితం అనేకవిధముల చిత్రిస్తారు. కాని గంజాయి త్రాగిన వాడే ఘనుడు. సారాయి త్రాగినవాడు సరసుడు. జ్ఞానసత్రపు మహిమ నెఱుగని యజ్ఞానులును సుప్రసిద్ధమైన సురయందు గల సుఖ మెఱుగని యప్రయోజకులును వీనిని విడవాడ వలయునందురు. సురగుండెకాయ నంతయు దహించును. ఒకమాఱు రుచిజూచిన బోవలదన గలరా. కావునవావలె కాముకులై వివాహమును విసర్జించవలయును. సురను త్రా

గవలెను. గుణా నామర్యాదను కాపాడవలెను. నీమీద ఉండే ప్రేమచేనేనీ రహస్యమును ఎరుకపరచితిని.

ఈరహస్యం రూపఅనంతలకు తెలియనివ్వదన్నాడు. తనచేతిలో ఒట్టు వేయించుకొన్నాడు.

తండ్రినిర్ణయం—ఆమెను గగ్గోలుపరచింది. తండ్రి గుణ మును మార్చగలనని ఊహకలిగి యుండెడిది. అదిప్పుడు నిష్ప్ర యోజనమయినది. కటకటా!సంసారం ఎన్నాళ్ళు యీ యిను ప కట కటాల్లో ఉంచి జీవించడం! తండ్రి మీద మమకా రం వదిలింది.

అవిశ్వాసం పుట్టింది.

ఆ మరునాడు జీవనుకు ఉత్తరం వ్రాసింది.

Dear jeevan!

రోజులు సరిగ్గాలేవు. పరిస్థితులు తారుమారయినవి. మేముఅజంతాపురం నిర్బంధంగా పోవలసివచ్చింది. మానాన్న యిదివరకన్నా కఠినుడయినాడు. వివాహంకాకుండా నేను నీతో రంగూన్ రావడం సమంజసముకాదని హెచ్చరిస్తున్నా.

Yours Lovingly

గుణ.

జీవను ఉత్తరం చదివాడు. రాజును అర్థంచేసుకొన్నాడు. హేమ పెండ్లికాకుండా రానంటుంది. పెద్దచిక్కు వచ్చిపడింది. పాశ్చాత్యులవలె చర్చిలో పెండ్లిచేసుకోవటానికి వీలులేదు. హిందూసమాజం, దానిసాంప్రదాయాన్ని పాటించాలి, ఈ విషమగడియ దాటడం ఎలా ?

ఆ మరునాడు పగలంతయు కంటుపడుచున్నది. రాత్రి సమయము గుణా జీవన్ కొఱకు వేచియుండెను, తండ్రి యింక ను ఏదోచదువుతూ ప్రక్కగదిలో అలజడ చేస్తూవున్నాడు.

గుణా అని కేకవినబడింది. మోసమని చెంపసౌజ్ఞ చేసింది. జీవన్—అర్థరాత్రి—గుణ యింటికివచ్చాడు.

గుణ నిట్టూర్పువిడిచింది. జీవన్ కంటతడిపెట్టాడు.

గుణా నన్ను నమ్ము మనం రంగూనులో పెండ్లిచేసుకుందాం.

జీవన్ సంఘమర్యాద లతిక్రమించి రాజాలను. కుటుంబగౌరవం నాలోజీర్ణించుకుని ఉంది. తండ్రి మనసు మార్చడం నాతరంకాదు.

మరి ఉపాయం ఆలోచించు—

రేపు కోర్టుకు వెళ్లి కలెక్టరుసమక్షమున నిన్ను వివాహ మాడెదను.

తండ్రి లేచినట్టుశబ్దం. వీధిలోకివచ్చి అంధకారాన్ని పరికించాడు. జీవన్ గుణాల సంభాషణ విన్నాడు. మరునాడు రాజు కోర్టుకువెళ్లాడు. నా అనుమతిలేనిది నా కూతురు గుణ వివాహం రిజష్టరు చేయకూడదన్నాడు. హిందూసిద్ధాంతప్రకారం యిలాంటి పెండ్లిళ్లకు తావులేదన్నాడు.

కలెక్టరు నెలరోజులు వాయిదావేశాడు—

గుణ కోర్టునుండి తిరిగివచ్చింది. జీవన్ యింటికివెళ్లాడు.

రూప అనంతలు కన్నీరుపెట్టారు.

విచారించి ఏమిలాభం. విధివిలాసం మార్చడానికి ఎవరితరం. అని గుణ యీవిధంగా ప్రార్థించింది.

పరాత్పరా! ఏవోవచ్చియు, రాని మాటలచే పిల్లలు తత్తరపడుచుండ తలిదండ్రులు వాటి భావమును గ్రహించి వారి అభీష్టమున కనుకూలమైన పదార్థములనిచ్చి సంతోషపెట్టుచుందురు. అటులనే మా వాక్యములు, కోర్కెలు అపూర్ణమైన భావములుకలిగి ఉండవచ్చును. కాని మాయుల్ల

మెరంగి మమ్ము కాపాడుము. శరణార్థిని. అదియునుగాక,

ఓపరాత్పరా! ప్రాణులందెంతయు నీకు ప్రేమాను రాగము మెండు. ప్రేమపిపాసినగు నాకొక తరుణోపాయము స్ఫురింపజేయుము. సిన్నన్ని వేళల ప్రార్థించెదను. ధర్మము, న్యాయము, సత్యము వదలకుండా కాపాడుము!

స్వర్ణను పిలచింది;

స్వర్ణా మా నాన్న విషయం సవిస్తరముగా నీకు తెలిసినంతవరకు చెప్పాము. మా అమ్మ ఉన్నరోజుల్లో అతడెలా సంచరించాడు.

అమ్మా ఏమని చెప్పను. మీనాన్న వూసలవీధిలో ఒక దాన్ని ప్రేమించాడు. ఆమె ఆవూరిరాజుకు పుట్టినదని గొప్పగా చెప్పుకుంటూఉండేది. ఆమెది దాసీకులం. ఏనుగు అంబారిమీద విహారించేదట. అదృష్టవశాత్తు ఆమె మీనాన్నను ప్రేమించింది. మీనాన్న ఆమెను ప్రేమించాడు. వారి కలయిక మీసంసారానికి రగులుకొల్పింది. మీఅమ్మను సరిగ్గా చూచేవాడు కాడు. సంఘానికి దడిచో, లేక యింకా కామం చేత పీడింపబడుటవలననో నామకా మీసంసారాన్ని పోషిస్తూ నిలబెట్టుతూవుండేవాడు. ఇవన్ని మీఅమ్మ ఓర్పుతో సహించి ఉండేది. ఒకనాడు మీఅమ్మనుకొట్టాడు, మీఅన్నల చదువు

పాడుచేశాడు. కామంకోసం మీ జీవితాలను సంకుచితం జేసాడు. ఇదిగని మీఅన్న పరారైనాడు. అమెరికాకు వెళ్ళా డంటారు. మీ పెద్దన్న, చిన్నన్న భాగంపంచుకొని విడిపో యారు. వారు ఇటలీలో ఉన్నారు.

స్వర్ణా ఈవిషయం రహస్యంగా ఇన్నాళ్లు ఎలా ఉంచ గలిగావు.

మీనాన్నమాట జవదాటడానికి వీల్లేదమ్మా.

ఆపిల్లలు మీపినతల్లికి పుట్టినవారు. ఇంకా మీనాన్న కామానికి దాసుడయ్యేవాడు. ఆదాసి మీనాన్నను చేరదీ యడం మానింది. పిల్లలు పెద్దవాండ్లయినా మీనాన్న కామంతో అంతులేకుండా ప్రవర్తిచేవాడు. ఆమెకు డబ్బు పెట్టకుండా పరాయిగా తిరుగుతూ వుండేవాడు. ఆమె నిందిం చడం మొదలెట్టింది. కోర్టులో దావా వేసింది. ఆమె నిందను భరింపలేక ఆస్తినిలబెట్టుకోవడానికి మరల మీతో కాపురం చేస్తూవచ్చాడు. యిది మీనాన్న పూర్వగాథ.

సరే. స్వర్ణా నీవు వెళ్ళవచ్చు.

గుణ జీవన్‌తో ప్యారిస్ వెళ్ళడానికి నిశ్చయించుకొంది, అంతరవాణి చెప్పిందంటుంది. ఈవార్త జీవన్‌కు తెలియపర

చింది. తండ్రి అజంతాపురమునకు ప్రయాణంకట్టాడు. ఎడ్ల బండ్లు యింటిముందరకొస్తున్నవి. యింట్లోసామగ్రి రూప, అనంతలు సర్దుబాటు చేస్తున్నారు. చెంప, గుణను అనుకరించింది. Juna అను కుక్కను వెంటబెట్టుకొని వెళ్ళాలని నిశ్చయించుకొంది. తండ్రి స్నేహితునియింటికి సొమ్ముకోసం వెళ్ళాడు. చెంపనుపంపి వేరొకబండి తెప్పించింది. తనసామాగ్రి, కుక్కను బండిఎక్కించి తాను ఆ బండిఎక్కింది. ఉత్తరం వ్రాసి బల్లమీాదపెట్టమని చెంప కిచ్చింది. తాను జీవన్‌ను కలుసుకొని Port Harbour కు వచ్చింది. వాళ్లిద్దరు స్టీమరు ఎక్కారు. రూప అనంతులు దుఃఖంతో సామాగ్రి సర్దుబాటు చేస్తున్నారు. గుణ పరదేశం వెళ్ళిందని, చెంప వారికి తెలియపరచింది.

తండ్రి రాజు చకచక ప్రవేశించాడు. గుణా అని కేక వేశాడు. గుణ లేదు. ఎక్కడికి వెళ్ళింది. ఏమని చెప్పింది. నన్నేమిచేసిపోయింది. చెంప నడిగాడు. ఆమె ఉత్తరం చేతికిచ్చినది. అతడిలా చదివాడు.

Dear Father!

క్షమించు. నీ ప్రవర్తన సరియైనదికాదు. నీ పూర్వపు చరిత్ర స్వర్ణవలన పూర్తిగావిన్నాను. నాకు అశాంతి చేకూర్చింది. నీకోసం నీ కూతుళ్లు సర్వపరిత్యాగం చేయజాలరు.

రూపకు త్వరలో పెండ్లిచెయి. లేదా ఆమె పరారవుతుంది. అనంతునకు నా దీవెనలనుము. నేను జీవన్‌తో ప్యారిస్ వెళ్తున్నాను, నేనతన్ని అక్కడ వివాహమాడెదను. నీయింట్లో బ్రతకడానికంటే మరణించటంహాయి. శాంతించు !

అదియునుగాక,

కానలేము కాలవుమర్మమేని నీవు
ఆజిలుగు వ్రాత చదువ సాధ్యంబె మనకు
తెర వెనుక నీవు నేనను పొరవుగలదు
ఆ విభేదము తెరయెత్తనంతరించు.
అనుజ్ఞవై ఎరింగితి రహస్యాంబరమున
చిన్న పెద్దల శుశ్రూష వేత్త నైత్తి
పోనిలోగుట్టు తెలియంగ ఒక్కనినిగనను,
మరలి వచ్చితి పోయిన మార్గమందే !

యిందులో ఒక కథ జతపరచాను, దాన్ని చదివి నీ అభిప్రాయం తెలియపరచు.

Your loving Daughter
Guna,

హా! గుణా ఏమని వ్రాశావు, నాయింట్లో బ్రతకడానికి

కంటే మరణించడం మేలు. అని వ్రాశావు. పట్టిబుర్రలు పట్టివెధవలు, నా వంశాన్ని నాశనం చేయుటానికి పుట్టిన కుల టవు. నా మర్యాదల మంటగలిపిన రాక్షసివి. నేనార్జించిన పేరుప్రతిష్టలు రూపుమాపిన రక్కసివి. అరెరే! నా కథలు మరల నన్నే కూల్చినవి. సుశీలవలె నీకాపరం వీధిపాలవదు కదా. Skyes వలె నీవు వీనస్త్రీవు కావుకదా! నాగ్రామం, నావల్లెవారందరికి అవమానకరమైనపని చేసివెళ్లావు. కులాన్ని కాదు-వంశాన్ని, దానిగౌరవాన్ని నాశనంచేయుడానికి పూను కున్న నీబుద్ధి పరాయివాడితో, "లేచిపోవడం" అనిపించుకుం టుంది. పాపం దాన్ని నీవు గుర్తించలా! ఏది నా Juna కుక్కనైనావిడచివెళ్ళిందా, లేదు దాన్నికూడా తీసుకొనివెళ్ళి ఉంటుంది. చేయదలచుకొని సర్వనాశనంచేసి వెళ్ళింది, పట్టి వెధవా!

'కలెక్టరు' గ్రామానికి వచ్చాడని చెంప చెప్పింది. రాజుయింట్లో, వివాహావిషయం తీర్పు చెప్పాలని, క్యాంపు వేసాడన్నారు. ఆ విషయమేమిటో అని ఆవూరివారంతా రాజు యింటిచుట్టూ గుమిగూడారు,

"అందు, ఆమెలోపం ఏమీలేదు. దుర్మార్గులెవరో ఆమె కీ దుర్బుద్ధి బోధించి ఉంటారు. చింతపడకు. సావకాశ ముగా పరిస్థితులు చక్కబడుతవి. ఆమె న్యాయమైన వివా హంచేసుకొని మరల తిరిగివస్తుంది. కులటకాదు. ఆమెప్రవర్తన

"తెగిపోవడం" అనిపించుకోదు. మహాగుణశాలి. అంధకారంలో ఉన్న అనుమానపిశాచాలకు జ్ఞానోదయం ప్రసాదించి వెలుగును చూపెట్టింది. పతివ్రతామతల్లుల పాతివ్రత్యాన్ని జ్ఞాపకం చేస్తుంది. నీ వంశవృక్షాన్ని నిలబెడుతుంది. నీ మనోభిప్రాయాన్ని మార్పుచెందిస్తుంది. మీకు శాంతి శుభములు పరాత్పరునివలన ప్రసాదింపజేస్తుంది." అని కలెక్టరు అంటాడు. ఆమె ఇచ్చిన ఉత్తరం మా రికార్డులో ఉండాలి. దానిని నా కందజేయండి. రాజు ఆమె ఉత్తరాన్ని కలెక్టరుకు యిస్తాడు.

గుణ జీవన్‌లు ఎక్కిన స్టీమరు సముద్రంలో పయనమై పోతూవుంది. అతడు ఆమెను గాఢంగా కౌగలించుకొన్నాడు. ఆమె అతని కౌగిలిని గౌరవించింది తన్మయురాలయినది. ఆ గదిలో కామవికారం వాళ్ళిద్దరు అనుభవించారు. తెల్లవారింది. స్టీమరు యింకను సముద్రంమీద అలాగే పయనమై పోతూవుంది. అతడు ఆమెను మరల బ్రతిమాలాడు. పరిమితి ఉండాలని ఆమె సమాధాన మిచ్చింది.

అతడు సిగ్గునభినయిస్తూ—అహాహా—అని నవ్వాడు.

పొదలో ఉన్న ముళ్ళని వెదకడం నాపనికాదు. కంటికి నచ్చిన పువ్వుల్ని ఎన్నుకోవడమే నా ఆశయ మన్నాడు.

ఆమె సంతోషించింది.

రూప అనంతులు అప్పగారి మనశ్శాంతి కొఱకు పరాత్పరుని ధ్యానించారు. పిల్లగండం, తల్లిగండమే కాని మంత్రసాని కేమిగండం అన్నసామెత వారిజీవితమంతు వ్యక్త పరుపబడినది.

గుణవిషయం ఆవూరివారిని గగ్గోలుపరచింది. గుణ జీవన్‌తో 'లేచిపోయింది' అని అనడం ప్రతియింట ప్రాకి పోయింది. అప్పటినుండి ఆవూరివారు తమకూతుళ్ళకు సకాలంలో పెండ్లిచేయడం ప్రారంభించారు.

పెండ్లీడు పెళ్ళికెళ్ళింది. మనం యింటికెళ్దాం.



## VI

గుణ తండ్రికివ్రాసిన శాంతమ్మ, సుగుణమ్మల కథ—యిష్టమైతే చదవండి—

దాని పేరు జీవితంలో ఒకవిధమైన తుపాను—తండ్రీ: తొందరపడక, సావకాశంగా విను.

వాళ్ళిద్దరు గదిలో అనుభవించే దృశ్యాన్ని నేను కళ్ళారచూశాను. స్నేహితుడు వెళ్ళాడు. నేను లోనికి ప్రవేసించా.

నా భార్యను, సుగుణను కొట్టడం, అవమానపరచడం, నా కంతగా మంచిదనిపించలేదు. కాని యీ విధంగా గద్దాయించా.

మీరిపుడు ఏంచేస్తున్నారు? నేను చూస్తానని మీ రెప్పుడైనా తలచారా? మీనడవడి ఏవిధంగా పరిణమిస్తుందో, విచారించారా? జాగ్రత్తగా మెలగండి...

పాపం, ఆవిడ చేసిన తప్పు ఒప్పుకొని కాళ్ళమీద పడింది, అతడు చకితుడయినాడు. కాని ఈలోపం ఎలా సహించగలడు. ఒకనిర్ణయానికి వచ్చాడు.

ఏమని—

రేపు అతడు గదిలోకి రావటంతో, నే ప్రవేసించెదను అతణ్ని పెట్టెలో పెట్టి తాళం వెయి. దానిపర్యవసానం నేను చూసుకుంటాను. కాని అతనికి నేనేమి అపకారం చేయను. అని వాగ్దానమిచ్చి ఒప్పిస్తాడు.

ఆ మరునాడు స్నేహితుడు వచ్చాడు. స్నేహితుని యింటికి భోజనానికి వెళ్తున్నానని భార్యకు చెప్పి, నావద్దకు వచ్చి. బజారుకు తీసుకొని వెళ్లాడు, అర్జంటుపని ఉంది, అంటూ నన్ను విడచి, మరల మాయింటికివచ్చి, నా భార్యతో సరసాలాడుతున్నాడు. నేను తిరిగి వచ్చేటప్పటికి షుమారు 10 గంటలయింది. నాభార్య యధావిధిగా అతన్ని పెట్టెలో పెట్టింది. నేను లోనికి ప్రవేశించాను. భోజనం వడ్డించమని ఆజ్ఞాపించాను. స్నేహితునిభార్య శాంతమ్మనుకూడా భోజనానికి పిలువమని ఆర్డరుచేశాను. భర్తవేరేచోట విందుకు వెళ్లాడనిన్నీ, తానొకతే వంటచేసుకోవాలని తలచి ఆవిడ మాయింటి విందుకు వొప్పుకుంది.

నాభార్య కిటికీలోంచి, ఆవిడను పిలువడం, నాస్నేహితుడు సహించి, పెట్లో ఎలాకూర్చోగలిగాడో, నా కర్థం కాలేదు.

ఏంచేస్తాడు. పాపం, చేసింది తప్పు. అటు భార్యను మోసంజేసి, స్నేహితుని యింటికి భోజనానికి వెళ్తానన్నాడు. ఇటు నన్ను మోసంజేసి, అర్జంటుపని ఉంది, అని మాయింటి కొచ్చాడు. బజారుకు వెళ్ళినవాళ్ళం, త్వరగా తిరిగి రావడం, అతడు నాభార్యతో సరసాలాడడం, మరింత అతని చర్యను కుంటుపరచింది. అలాగే ఆ పెట్టెలో, అణిగి మణిగి యున్నాడు.

అతనిభార్య శాంతమ్మగారు మాయింటి కొచ్చి యిలా ప్రశ్నించింది—ఏమన్నా! విశేషాలేమిటి? ఈరోజు విందుకు పిలవటానికి కారణం? మావారు స్నేహితుని యింటికి విందుకు వెళ్తానన్నారు. నేనొక్కతిని భోజనానికి తయారవుదామని, నిరుత్సాంగా ఆలోచిస్తూవుంటే మీ కబురు నన్నాప్రయత్నమునుండి విరమింపజేసింది. సమయానికి అనుకూలంగా వచ్చిన ఈ విందుకు, కాదనకుండా రావలసి వచ్చింది.

శాంతమ్మగారు, మిమ్ములను ఒకవిషయంగురించి అడగటానికి పిలువనంపాను. ముందు విందు ఆరగించండి, మనమా కబుర్లలో విషయాన్ని ఆలోచిద్దాం—నాభార్య, వంట వడ్డించింది.

మీరేమీ మొహమాటం పడొద్దు. తృప్తిగా భోంచేయండి. అని నేనన్నాను.

కులాసాగా కబుర్లుచెప్పుకుంటూ తిన్నాం.

ఈరోజు మీరు మాతోకలసి భోజనముచేయడం, మా ఆవిడకు, ఎంతోసంతోషం, ఆనందంగా ఉంది, శాంతమ్మ గారు, అని నేనన్నాను.

సుగుణా! నీ వా పెరటిలోకి వెళ్ళు! శాంతమ్మగారితో రహస్యంగా మాట్లాడాలి. అని నాభార్యకు సౌజ్ఞచేసాను.

పోనీ—ఆమెఉంటేఏం! ఆవిడకు తెలియని రహస్యాలు మన కేముంటాయి. ఆమె ఉండితీరాలి.

అలాకాదు శాంతమ్మగారు. పరిస్థితులు మీకు తెలియవు. ఆవిడ వెళ్ళకతప్పదు.

సుగుణా: నీవువెళ్ళు అని నేనటంతో, సుగుణ బైటకు వెళ్ళింది. ఇక శాంతమ్మగారితో సంభాషణ ఏమని?

..........గుసగుసలు, గుసగుసలు....మీరునాతో సరసాలాడుదారు, రండి—

శాంతమ్మ ఆశ్చర్యపడింది. మనమిద్దరం యిలాఎప్పుడు

మాట్లాడుకోలేదే. మీచర్య నాకు విపరీతంగా కనబడుతుంది. స్నేహితుని భార్యయెడ, మీ రీవిధంగా ప్రవర్తించడం తగని పని. మీరిలా మోసం చేస్తారనుకోలేదు. సుగుణా నీవుకూడా ఈమోసానికి ఒప్పుకొన్నావా? నీభర్తచేష్టలు అరికట్టలేకపో యావా? నీవలా బయటకువెళ్ళడం నాకెంతో అనుమానం వేసింది.

శాదమ్మా: నీవు నాకోర్కె తీర్చాలి. మీ ఆయన నాభార్యను "చెరిచాడు". మిత్రుడవటంవల్ల, అతనికి అప కారం చేయడం నాకు యిష్టంలేదు. కాని దానికి పరిహారం నీవు నా అభీష్టము తీర్చడం, లేదా నీభర్త సర్వనాశన మవు తాడు. మీ కుటుంబం అంతరిస్తుంది. జాగ్రత్త!

అయితే సుగుణను అడిగి చూడండి.

సుగుణా ఇటురా! శాంతమ్మగారు ఆ విషయం రుజువు అడుగుతుంది.

శాంతా! నే నేమనిచెప్పేదును. అంతా మాయగా జరిగింది. మీవారు నాతో సుఖంగా ఉంటూవచ్చారు. కాలాని కనుకూలంగా కామానికి దాసులయ్యాం. జీవితాన్ని సుఖంగా గడుపుతూ వున్నాం. కాని ఒకనాడు, మావారు, మా చేష్టలను చూశారు. భావం గ్రహించారు. వారిని వారిం

చడం నాతరంకాదు. ఈ పరిస్థితులలో నీవు సహాయం చేయక తప్పదమ్మా! అంతా నీకు వదిలాను.

సరే, మీకోర్కె తీర్చడం అవసరమనుకుంటాను. కాని ఈ విషయం నాభర్తకు తెలియకుండా రహస్యంగా ఉంచాలి.

సరే: నీ వా పెట్టెమీద పడుకో. సుగుణా నీవు అవతలకు వెళ్లు, అంటూ వాళ్ళిద్దరు "ఆనందాన్ని" ఆపెట్టెమీద, అనుభవించారు.

పాపం, పెట్టెలో ఉన్న స్నేహితుడు అంతా వింటున్నాడు. కాని తాను పెట్టెలో ఉన్నసంగతి వాళ్ళకు తెలియదని సంతోషపడుతూ అలాగే నక్కి ఉన్నాడు.

శాంతమ్మగారు, మీ త్యాగానికి నేనెంతయు కృతజ్ఞుడను. స్నేహితుల కుటుంబాలు విఘ్నంకాకుండా మీ రీపనికి ఒప్పుకోవడం, గౌరవింపదగినది, నేను చాలాసంతోషించాను. మీకు కానుకగా ముత్యాలహారం యిస్తాను. ఈ పెట్టెలో ఉంది. తలుపుతీయండి.

పెట్టెమూత చాల బరువుగనున్నదే. యింత పెద్దపెట్టె చేయించడం, దాని అవసరం నాకు గోచర మవటంలేదు.

వీటికి గాలిచోరె కన్నాలుగూడా ఉన్నవి.

.............

ఆ ఏమది! ఎవరు—...నా భర్త. యిందులో ఎలా ఉంచావు. మనసంగతంతా వింటూ యితడెలా సహించి ఊరుకున్నాడు. నాకర్థం కావడంలేదు. అంటూ సిగ్గు, అవమానంతో తలవంచుకొంది. ఆమె భర్తకూడా ఆమె ననుకరించాడు,

దుఃఖపడకండి. మనం సుఖంగా ఈ మార్గాన్ని నడిపిస్తూ ఉందాం! ఏలాంటి అలజడలు లేకుండా యిప్పటికి విడిపోదాం! సెలవు—జైహింద్—అంటూ జీవితము ఆ విధంగా వారుసాగిస్తూ వచ్చారు.

దీని అంతరార్థం ఏమిటి! ఈ జీవితాల గమ్యస్థానం ప్రపంచానికి ఆదర్శంగా ఉంటాయా? ఇది సామాన్యంగా ఏదో ఒక కుటుంబంల్లోనే జరిగివుందా? ఈ నడవడికగల వాళ్ళనుచూస్తే, ఏమనిపిస్తుంది? ఇందు ఎవరిది తప్పు? ఈవివరాలు నాకు ప్యారిస్‌కు వ్రాయి. దయవుంచు—నాకిక సెలవు? అని గుణ కథ పూర్తిజేసింది.



సమాప్తి.

